# ప్రభ

(అశ్వఘోషుని జీవితగాథ.)

2500 వ బుద్ధపరినిర్వాణ జయంతికి నివాళులు



ఆచార్య మాడభూషి వెంకటాచార్య.
ఎం. ఏ. (హిందీ). ఎం. ఏ. (సంస్కృతం) గీతాచార్య (కా. వి.).
సంస్కృత ఆంధ్ర హిందీభాషల మాజీఆచార్యులు.
ఆర్ట్సుకళాశాల, రాజమహేంద్రవరం. ప్రెసిడెన్సీకళాశాల, మద్రాసు.
నిజాంకళాశాల, ఉస్మానియా విశ్వవిద్యాలయము.

మొదటి ముద్రణ
1000 ప్రతులు

వెల రు. 2—0—0

(ఈవెలలో రు 0-8-0 శ్రీకృష్ణాశ్రమము పెదముత్తేవివారికి చెందును.)

ప్రాప్తిస్థానం :—
M. V. శేషాచారి M. A. B. Ed.
6 th Cross రోడ్డు - బ్రాడీపేట - గుంటూరు.



# శ్రీ గురుస్తవం

జగద్రక్షకుడు సీతారాముడు జనులందరు మీ రెరుగండీ !
జగతిలో ధర్మస్థాపన జేయగ జన్మించిన హరి ఇతడండీ !!
జ్ఞాన మొక్కటే మోక్షమొసగదని చాటించిన వాడితడండీ,
భక్తి వినా మరేమార్గము లేదని బాటలో పెట్టిన దితడండీ ॥ జగ ॥

ముముక్షువులకు మార్గము జూపగ సంఘము పెట్టిన గితడండీ,
శిష్యులనెల్ల శ్రీకృష్ణాశ్రమమున చేరదీసినదీ ఇతడండీ ॥ జగ ॥

శ్రీ గీతను చిలికీ గీతామృతము ప్రసాదించినది ఇతడండీ,
అమృతవాహిని ప్రవహింపజేసిన భగీరథుడే ఇతడండీ ॥ జగ ॥

నాస్తిక శిరోమణులకు నైనా శరణ్య మిచ్చిన దితడండీ,
సకల మతముల సార మొక్కటే అనినది ఇతడండీ ॥ జగ ॥

అశాంతిని గాంచీ హేమాహేమీ లేమియు దోచక నుండిరహా !
హృదిపరివర్తన రాచబాట యని ఉపదేశించిన దితడండీ ॥ జగ ॥

ఏమీ ! స్వామీ ! నీ మహిమంబని భక్తులు గొలిచిన దితడండీ,
పరమపాపియగా వేంకటదాసుని గాచి బ్రోచిన దితడండీ ॥ జగ ॥

ఆచార్య. మాడభూషి వేంకటాచార్యదాసుడు,

**14-3-56** వేకువజామున.

శ్రీమన్నారాయణమూర్తి కృపాకటాక్షము వలన శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ (1008) సీతారామయతీంద్రులవారు నన్ను ఇటీవలనే తమ శిష్యునిగా అంగీకరించినారు.

ఇకముందు శ్రీవారి సిద్ధాంతాలను లోకంలో బహుళ వ్యాప్తి చేయడానికి వారు చేపట్టిన పరికరమాత్రులలో నేనూ ఒకడను. నా తను మన ధన ప్రాణములను శ్రీవారి పాదపద్మాలవద్ద అంకితం చేస్తున్నాను. ఈ నా సంకల్పం నేను నిర్వహించేలాగు చేసే బాధ్యత శ్రీవారిపైననే ఉంచుతున్నాను.



# అంకితం



శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు, రాజ్యసభాసదస్యుడు.

ఏంరా, సత్యం!

నేను ఏసత్యాన్ని చిన్నప్పటినుంచీ ప్రేమిస్తూవచ్చానో నీలోగల ఆ సత్యానికి ఈ నాటకం అంకితం చేస్తున్నాను. ఇందుకు నువ్వు అంగీకరించి నన్ను ధన్యుణ్ణిచేశావు.

అసలు మొదట్లో ఈ నాటకంలోని కథావస్తువు మహా పండిత, త్రిపీటకాచార్య, శ్రీ రాహుల్ సాంకృత్యాయనునిది. పదమూడేళ్ళక్రితం శ్రీ రాహుల్‌జీద్వారా నాకు అశ్వఘోషుని జీవితగాథ తెలిసికొనే అవకాశం కలిగింది. ఆనాడే అశ్వఘోషుని జీవితగాథను ఇతివృత్తంగా తీసికొని ఒక నాటకంగా వ్రాయాలని సంకల్పం చేసుకొన్నాను. తరువాత జీవితప్రవాహంలో కొట్టుకుపోయాను. నా జీవితంలో ఎన్నో మార్పులు వచ్చినవి. అనేక మజిలీలు దాటాను. గమ్యస్థానమేదో యొకటున్నదని నాకు పూర్తిగా తెలుసు, కాని అదియేదో స్పష్టంగా నాకప్పుడు కనబడలేదు. తదుపరి కొన్ని ఏండ్లు గడచినతరువాత నువ్వు ఒకనాడు నేను మదరాసు ప్రెసిడెన్సీ కళాశాలలో ఆచార్యుడుగా పనిచేస్తూఉండగా నువ్వు అనువదించిన 'ఓల్గానుండి గంగావరకు' అను గ్రంథానికి పరిచయవాక్యం వ్రాసిపెట్టమన్నావు. ఒకరాత్రి అంతా

మేల్కొని ఆ నీగ్రంథం చదివాను. అప్పుడు మళ్ళీ నాపూర్వ సంకల్పం జ్ఞప్తికివచ్చింది. దానిఫలితమే ఈ నా రచన. ఈ వస్తువు నీదేఅంటాను. నీ వస్తువు నీవే తీసుకో.

ఇది ఈరూపంలో రావడానికి ఎందరో తండ్రులకు మరెంద రెందరో తల్లులకు నేను ఋణపడి ఉన్నాను. వాళ్ళ పేర్లుచెప్పడం ఇప్పుడునేను ఏర్పర్చుకున్న మర్యాదకు విరుద్ధం. వారందరకు నాసాష్టాంగ నమస్కారములు. దీనిని నేను మళ్ళీ చదువుకొన్నప్పుడు ఇదినేను వ్రాసినానని నమ్మలేక పోయి నాను. ఎవరో వ్రాయించారు నాచేత. వారెవరు ?

శ్రీ వేదుల, శ్రీ నాయనివారు, శ్రీ మల్లాదివారు, డా. లక్ష్మణరావుగారు- వీరిగేయాలను నేను ఈ నాటకములో వాడుకున్నాను. వారికి నా కృతజ్ఞతలు.

నీ వెంకటదాసు.

4-5-1956

# ఇందువచ్చు పాత్రలు



అశ్వఘోషుడు — (కథానాయకుడు)

సువర్ణాక్షుడు — (అశ్వఘోషునితండ్రి)

సువర్ణాక్షి — అశ్వఘోషునితల్లి)

ప్రభ — (కథానాయకి - గ్రీకువనిత)

బుద్ధప్రియుడు — (గ్రీకునాటకసమాజ సంచాలకుడు)

కైలాసనాగుడు — (అశ్వఘోషునిమిత్రుడు - వైశ్యుడు)

సుబోధమిత్ర — (అశ్వఘోషునిమిత్రుడు - క్షత్రియుడు)

ధర్మరక్షిత్ — (మహాభిక్షువు - త్రిపీటకఆచారి)



(మొదటి దృశ్యంలో తెర ఎత్తక మునుపు నేపథ్యంలో నుండి)

"రసికశిఖామణులారా! ఆనాడు-2000 ఏండ్ల క్రితం

"ప్రసారయ ధర్మధ్వజం ;
ప్రతూర్య ధర్మశంఖం ,
ప్రతాడయ ధర్మదుందుభిం ;
ధర్మంకురు, ధర్మంకురు, ధర్మంకురు"

అని ఉద్బోధించాడు ఒక మహాకవి.

ధర్మధ్వజాన్ని ఆరోహించు ;
ధర్మశంఖాన్ని పూరించు ;
ధర్మదుందుభిని మ్రోగించు ;
ధర్మాన్ని ఆచరించు.

" "

" "

అతడెవరు ?

అతడే మన అమర అశ్వఘోషుడు.

ఆయన జీవితాన్ని నాటకంరూపంలో మీముందు ప్రదర్శిస్తున్నాం. చూడండి; మమ్ములను ధన్యులను గావించండి, మీరూ తరించండి".

(తరువాత తెర ఎత్తుతారు.)

శ్రీమతే రామానుజాయనమః

# ప్రభ

## మొదటి దృశ్యము

స్థలము :- సాకేతనగరము, ఉద్యానవనము, అప్పుడే సూర్యుడు ఉదయిస్తున్నాడు. ఆ నగరపౌరుడైన సుబోధమిత్ర ప్రవేశిస్తాడు. నేపథ్యంలోనుంచి ప్రకృతిసౌందర్యాన్ని వర్ణించేపాట వినబడుతూ ఉంటుంది. మిత్ర దాని కనుగుణ్యంగా హావభావాలు ముఖముపై అభినయిస్తాడు. మిత్ర ప్రకృతిసౌందర్యంలో తన్మయుడై యుండగా, అతని మిత్రుడు కైలాసనాగ్ రంగస్థలం మీదికి ప్రవేశిస్తాడు. నాగ్ దగ్గుతాడు. మిత్ర ఉలిక్కిపడతాడు. అటుతిరిగి—

మిత్ర :- ఆఁ! నువ్వా!

నాగ్ :- అవును. నేనే.

మి :- (కళ్ళు నలుపుకొని, కనురెప్పలు మూసి, తెరచి)- ఇది కలకాదు కదా!

నా :- కలకాదురా మిత్రా, వాస్తవమే.

మి :- (పూర్తిగా తెప్పరిల్లి) - ఓహో ; అవునవును. కలకాదు. నిజమే. అవునుకాని, మరి నీవు దారి తప్పి వచ్చావేంరా ?

నా :- దారితప్పేమిత్రా ? దారి తెలిసే వచ్చాను.

మి :- ఏం, యిల్లా బుద్ధిపుట్టిం దివ్వాళ ?

నా :- రోజూ పెందరాడే లేచి నువ్వు యీ ఉద్యానవనానికి వస్తూవుంటావని నాకు బాగా తెలుసుగా. నిక్షేపంలాంటి

నిద్ర పోగొట్టుకొని ఎందుకిలా రోజూ వస్తూవుంటావో, నేను కూడా తెలుసుకుందామని వచ్చానురా.

మి :- చూడు నాగూ, యీ ప్రకృతి కాంత చక్కదనం! రోజూ యిల్లా పునీత ప్రభాత సమయాన ప్రకృతి దేవిని పరిశీలిస్తా; రమ్యభవ్య సూర్యోదయాన్ని తిలకిస్తా; రక రకాల పక్షుల సంగీత మాధుర్యాన్ని ఆస్వాదిస్తా. నా మనస్సెంతో నిర్మల మౌతుంది. మది యంతా సాత్వీక భావ పూరిత మౌతుంది. ఇక ఆరోజంతా ఎనలేని ఉత్సా హంతో, మొక్కవోని ఉల్లాసంతో, సంసార కాండ సాగిస్తా.

నా :- మ్ం_ సరేకాని, నాకో సందేహముందిరా. మరి, నగ్నస్త్రీని, అప్పుడే ఉదయిస్తున్న సూర్యుణ్ణి, చూడ కూడదని కొందరు శాస్త్రకారులు నిషేధించారని వినికిడి. మరినువ్వు సూర్యోదయము.......

మి :- (మాటకడ్డంగావచ్చి)వీటిని చూడ్డం శాస్త్ర సమ్మతమేనా అని కాదూ నీశంక?

నా :- ఆఁ - అవునవును.

మి :- చూడూ! నా అనుభూతి మీద నాకు సంపూర్ణ విశ్వాసముంది. ఇన్నాళ్ళ అనుభవమువల్ల నేను తెలుసు కుందేమిటంటే, సూర్యోదయదర్శనం మంగళకరం, శుభప్రదం అని. అనుభవంముందు శాస్త్రాలు, గీస్త్రాలు తీసికట్టు.

నా :- అంతవరకూ వచ్చిందీ, అబ్బాయిపని ? ఆ౯, ఆరు నెలలు సహవాసము చేస్తే, వారు వీరౌతారు. ఆఘోష్ గారి స్నేహంచేసి నువ్వూ చెడిపోతున్నావ్? మన పెద్ద వాళ్లు చంపేస్తారోరోయి, తెలిస్తే.

మి :- (చెంపలేసుకుంటూ) - ఆ ఘోష్ పరమపవిత్రుడు. అతనిస్నేహంవల్ల నా కెన్నో సుగుణాలు అబ్బినాయి. అతడున్నాడే, .........

నా :- అదల్లావుంచు. సరేకాని, ఇంకోవిషయము అడగాలని వుందిరా.

మి :- ఓరీ శంకల రాయుడా! యింకో శంక కాదుగదా, కొంపతీసి.

నా :- శంక కాదులేరా, కొద్దిభోగట్టా కావాలి.

మి :- ఎవరి భోగట్టారా?

నా :- ఆ పిల్ల ఎవరురా ?

మి :- పిల్లా! ఏ పిల్లరా ?

నా :- ఆ౯! మొన్న సరయూనదిలో వసంతోత్సవ సందర్భంలో యీతపోటీల్లో మొదటిదిగా వచ్చిందే, ఆ పిల్లరా.

మి :- ఓహో! ఆ పిల్లా ? ఆమె గ్రీకువర్తకశిఖామణి దత్తమిత్రుడు లేడూ ? ఆ దత్తమిత్రుడి ఏకైక పుత్రిక.

నా :- అల్లాచెప్పు. అందుకే ఆ పిల్ల అంత అందంగా వుంది. మరి ఆ పిల్ల పేరేమిటిరా ?

ప్రభ

మి :- ప్రభ.

నా :- ఓహో! సార్థకమైన నామమే. పేరుకు తగ్గట్టే, ఆమెలో ఒక అసాధారణమైన వెలుగుకూడా వుంది.

మి :- (ఎగాదిగాచూసి) నీ వాలకమంతా చూస్తే, ఆ పిల్ల మీద కన్నేసినట్లున్నావే ?

నా :- నీ బుద్ధి బుగ్గిఅయిపోను. ఆ అమ్మాయి చక్కని చుక్క, అందాలభరిణె. యీతపోటీల్లో అశ్వఘోష్‌తో సమంగా వచ్చింది. ఆమెను గురించిన భోగట్టా తెలుసుకోవాలని నా కుతూహలము వెలిబుస్తే, ఆమెమీద, నే కన్నేసినట్లా ? నీ తెలివి మండా.

మి :- ఓరి సిసింద్రీ! నీ పేరే నాగు. పాములాగా బుస పెడుతూ లేస్తున్నావే ? - ప్చ్ - ఏదో గమ్మత్తుగా అన్నా రా. (తల గోక్కుంటూ)

నా :- అతను ఎవరబ్బాయి ? మరచిపోయినాలే.

మి :- అయితే చెపుతాలే. మనవూళ్లో సువర్ణాక్షుడనే బ్రాహ్మణుడు లేడూ ? అతని కొడుకు. అతని పాండిత్యం, దేశ దేశాలకూ ప్రాకింది. అతను సర్వవేదశాస్త్రాలలో నిధి. ప్రజలు అతని కావ్యాలే చదువుతూ మైమరుస్తూంటారు.

నా :- అరే! అతను రచించిన ప్రేమ గేయాలేనా మన యువతీ యువకులు పాడుతూవుంట ?

మి :- అవునురా.

నా :- అల్లాఅయితే, నాకూ అతనితో పరిచయము చేసుకోవాలని వుంది.

మి :- ఏం ? కొంపతీసి నీ వేమైనా కవిత్వం వ్రాశావా ఏమిటి ? అదేమైనా దిద్దించుకోవాలనుకుంటున్నావా ?

నా :- తెలుసు లేవోయ్ మహా! నువ్వా కవిత్వం వెలగబెడుతున్నావని, ఏం? వైశ్యులమని మేమంటే అంత ఎగతాళా?

మి :- లేదురా, ఏదో గమ్మత్తుగా అన్నా. ప్రతిదీ పట్టించేనా నీకు?

నా :- సరేకానీ, ఏళ్ళతరబడి యీ పోటీలలో ఏ గ్రీకు దేశీయుడో లేక ఏ క్షత్రియుడో ప్రథమ బహుమతి సంపాదించేవాడు. యీ ఏదు బ్రాహ్మడు గెలిచాడే - వాడి తస్సాదియ్యా!

మి :- అదేమిటిరా, దిట్టమయిన వాళ్లు ఒక కులంలో ఏమిటి, అన్ని కులాల్లోనూ వుంటారు, వున్నారు. ఆశ్చర్యం ఏముంది?

నా :- అదికాదు, నేనంట. చదువు సంధ్యలలో బ్రాహ్మలదే పై చేయి. ఒప్పుకుంటా కాని ఆటల్లో కూడా ... ...

మి :- నాగూ, చదువు సంధ్యల్లో పైచెయ్యి బ్రాహ్మలదంటావు. నేనూ ఒప్పుకుంటా ఆ మాట. కాని ఆ తెలివి తేటలు ఆకాశంలోంచి ఆపళంగా వూడి వాళ్ళ బుర్రల్లో ప్రవేశించలేదు.

ప్రభ

మి :- ప్రభ.

నా :- ఓహో! సార్థకమైన నామమే. పేరుకు తగ్గట్టే, ఆమెలో ఒక అసాధారణమైన వెలుగుకూడా వుంది.

మి :- (ఎగాదిగాచూసి) నీ వాలకమంతా చూస్తే, ఆ పిల్ల మీద కన్నేసినట్లున్నావే ?

నా :- నీ బుద్ధి బుగ్గిఅయిపోను. ఆ అమ్మాయి చక్కని చుక్క, అందాలభరిణె. యీతపోటీల్లో అశ్వఘోష్‌తో సమంగా వచ్చింది. ఆమెను గురించిన భోగట్టా తెలుసుకోవాలని నా కుతూహలము వెలిబుస్తే, ఆమెమీద, నే కన్నేసినట్లా ? నీ తెలివి మండా.

మి :- ఓరి సిసింద్రీ! నీ పేరే నాగు. పాములాగా బుస పెడుతూ లేస్తున్నావే ? - ప్చ్ - ఏదో గమ్మత్తుగా అన్నా రా. (తల గోక్కుంటూ)

నా :- అతను ఎవరబ్బాయి ? మరచిపోయినాలే.

మి :- అయితే చెప్తాలే. మనవూళ్లోసువర్ణాక్షుడనే బ్రాహ్మణుడు లేడూ ? అతని కొడుకు. అతని పాండిత్యం, దేశ దేశాలకూ ప్రాకింది. అతను సర్వవేదశాస్త్రాలలో నిధి. ప్రజలు అతని కావ్యాలే చదువుతూ మైమరుస్తూంటారు.

నా :- అరే! అతను రచించిన ప్రేమ గేయాలేనా మన యువతీ యువకులు పాడుతూవుంట ?

మి :- అవునురా.

నా :- అల్లాఅయితే, నాకూ అతనితో పరిచయము చేసుకోవాలని వుంది.

మి :- ఏం ? కొంపతీసి నీ వేమైనా కవిత్వం వ్రాశావా ఏమిటి ? అదేమైనా దిద్దించుకోవాలనుకుంటున్నావా ?

నా :- తెలుసు లేవోయ్ మహా! నువ్వో కవిత్వం వెలగబెడుతున్నావని, ఏం? వైశ్యులమని మేమంటే అంత ఎగతాళా?

మి :- లేదురా, ఏదో గమ్మత్తుగా అన్నా. ప్రతిదీ పట్టింపేనా నీకు?

నా :- సరేకానీ, ఏళ్ళతరబడి యీ పోటీలలో ఏ గ్రీకు దేశీయుడో లేక ఏకుతిృయుడో ప్రథమ బహుమతి సంపాదించేవాడు. యీ ఏడు బ్రాహ్మడు గెలిచాడే - వాడి తస్సాదియ్యా!

మి :- అదేమిటిరా, దిట్టమయిన వాళ్లు ఒక కులంలో ఏమిటి, అన్ని కులాల్లోనూ వుంటారు, వున్నారు. ఆశ్చర్యం ఏముంది?

నా :- అది కాదు, నేనంట. చదువు సంధ్యలలో బ్రాహ్మలదే పై చేయి. ఒప్పుకుంటా కాని ఆటల్లో కూడా ... ...

మి :- నాగూ, చదువు సంధ్యల్లో పైచెయ్యి బ్రాహ్మలదంటావు. నేనూ ఒప్పుకుంటా ఆ మాట. కాని ఆ తెలివి తేటలు ఆకాశంలోంచి ఆపళంగా వూడి వాళ్ళ బుర్రల్లో ప్రవేశించలేదు.

నా :– కాదులే, నీ బుర్రలోంచి వూడి వాళ్ల బుర్రలో ప్రవేశించింది.

మి :– ఓరి మూర్ఖుడా, నామాట పూర్తిగా వినకుండానే వ్యాఖ్యానము సాగిస్తున్నావు. నీదగ్గరున్న పాడు అలవాటు యిదేరా. ఇంక నీతో మాట్లాడను.

నా :– సరే, సరే– (చెంపలేసుకుంటూ) బుద్ధి గడ్డితిన్నది. ఇంక మాట్లాడను. కొనసంటూ చెప్పు, వింటా.

మి :– అయితే సరే, విను. ఏన్నో వేల తరాల నుంచి బ్రాహ్మలు వేదాలన్నీ కంఠస్థంచేస్తూ వచ్చారు. ఒప్పుకుంటావా?

నా :– అవును. ఒప్పుకోవాలి, ఒప్పుకొనితీరాలి.

మి :– వాళ్లకు పుట్టినవాళ్లు సామాన్యంగా చదువులో తెలివితేటలు గలవాళ్లై వుండటం సహజం కాదూ?

నా :– ఆగు. ఆగు. అయితే, గొప్ప విద్వాంసులకు మూర్ఖ శిఖామణులు పుట్టడంలేదా?

మి :– అవును, సకృత్తుగా పుడుతూ వుంటారు.

నా :– ఇంకేం, నీ సిద్ధాంతం రాద్ధాంతం అయిపోయింది.

మి :– నీ తెలివి తెల్లవారినట్లే వున్నది. ఆ పండిత పుత్రుని కొడుకో, మనుమడో, మునిమనుమడో, మళ్ళీ అసాధారణ పాండిత్య ప్రపూర్ణుడై పుట్టి తీరుతాడు.

నా :– (తల గోక్కుంటూ) అదీ నిజమే చూస్తే. అయితే నువు తేల్చేదేమిటి ?

మి :– ఉండూ, తొందరపడకు. అందువల్ల బ్రాహ్మలు "తెలివితేటలన్నీ మా గుత్తసొమ్ము, మేమందరికంటే గొప్పవాళ్ళం, తతిమ్మావాళ్లు మాతో తులతూగలేరు", అని, విఱ్ఱవీగడం సమంజసం కాదు. సరియైన అవకాశాలు కలుగజేస్తే, కొన్ని తరాలు యితరకులాలవాళ్ళు విద్యాభ్యాసం చేస్తే, ఆ కులాల్లోనూ పుట్టేవాళ్ళు హేమాహేమీలై తీరుతారు.

నా :– తెలిసింది. మిత్రమా, ఆలోచిస్తే, నువ్వు చెప్పిందే సరిగావుందని తోస్తూంది.

మి :– అల్లా ఆలోచిస్తూ వుండు. పరమేశ్వరుడు మానవులకు మెదడు ప్రసాదించింది, అన్ని విషయాలు సాకల్యంగా తరిచి, నవనీతంలాంటి సత్యాన్ని బయటికి తీయటానికని. అంతేకాని... ...

నా :– (నవ్వుతూ) – ఓరి మిత్రా, ఘోష్ స్నేహంవల్ల, నీలోనుంచీ కవిత్వం పుట్టుకొస్తున్నట్టుందే.

మి :– ఇందులో విడ్డూర మేముంది ? అతని సాన్నిధ్యం మహిమ. అదే కాకుండా, ఆ సౌందర్యపేటిక ప్రభను చూచిన తరువాత, మ్రోడులోనుంచైనా కవిత్వం చిగురించక మానదు.

నా :– సరి, సరి. ఉన్నకవులతోనే చస్తూవున్నాము.

నువ్వూ కవిత్వం వ్రాయటం మొదలెడితే, చస్తాం అందరం. – (తలగోక్కుంటూ) – అసలువిషయం చెప్ప లేదు. అరే మిత్రా, ! ఆ ఘోష్! ఓహో! ఆ ప్రభా! ఘోషో కవి! ప్రభో, మంచి నటీమణి! ఇద్దరూ, అందంలో ఒకరిని మించినవారొకరు. వీరిద్దరికీ పెళ్ళవుతే...ఓహో! ఇక చెప్పేవు.

మి :– బంగారానికి తావి అబ్బినట్లవుతుంది. ఊఁ, నువ్వూ కట్టు కవిత్వం.

నా :– ఒరేయి, ఎగతాళి కట్టిపెట్టరా. నేను చాలా గంభీరంగా మాట్లాడుతున్నాను. వాళ్లు భార్యాభర్తలైతే...

మి :– వర్ణాంతర వివాహమే! అమ్మయ్యో! సంఘం అంతా రాంబందుల్లా వాళ్ల మీదపడి పీకి తినేయదూ?

నా :– పోరా నీ సంఘం, గింఘం.

మి :– మరి నాగూ, సంఘం పెట్టిన కట్టుబాట్లకు లోబడక ప్రతివ్యక్తీ తిరగబడటం మొదలెడితే, అరాజకం అవతరించదూ?

నా :– అరాజకములేదు, గిరాజకములేదు. ఒక్కొక్కప్పుడు సంఘంమీద వ్యక్తితిరగబడనిదే, సంఘం అభ్యుదయ పథంలోనికి సాగిపోదు.

మి :– నువ్వు వైశ్యుడవవటంవల్ల సనాతన ఛాందసుడవను కున్నా. కాని నీలోనూ, అధునాతనభావబీజా లున్నా యని తెలుసుకోలేదు.

నా :- ఇప్పుడు తెలుసుకో. ఇన్నాళ్లు స్నేహంచేసినా, నా లోని భావాలు తెలుసుకో లేక పోయావ్ నువ్వు.

మి :- (నవ్వుతూ) అసలు నాకూ ఈ అభిప్రాయాలే వున్నాయ్ రా. ఏదో, నువ్వేమంటావో తెలుసుకోవాలని అల్లా అన్నానే గాని, నామనస్సుకూ అదే భావం తట్టిందిరా. ప్రభా ఘోష్‌లు జత కలిస్తే, చూసుకో ఇంక, వాళ్లకు పుట్టే సంతానం మణిపూసలా తయారవ్వదూ.

నా :- (నవ్వుతూ) ఆగు, ఆగు. ఆలులేదు, చూలులేదు, కొడుకు పేరుసోమలింగంట. (కొస్త ఆగి చిటిక వేసి) తట్టిందిరా! ఒరే మిత్రా, తట్టిందొక ఆలోచన. నీ మిత్ర గోష్ఠిలో దీని కనుకూలంగా నీవు ప్రచారంచేయి. నేనూ, మా యువక బృందంలో నాకు చేతనైనంత ప్రచారం చేస్తా. మనపెద్దవాళ్లు దీనికి బొత్తిగా అంగీకరించరని నాకు బాగా తెలుసు. అయినా ఆ దేముడిమీద భారం వేసి, మన ప్రయత్నం మనము చేద్దాం. ఆపైన యీశ్వరేచ్ఛ ఎలా వుంటే అలా జరుగుతుంది.

మి :- వైశ్యుడవైనా మంచి ఆలోచన చెప్పావురా. ఇందుకు మన యువక బృందమంతా నీ పట్ల కృతజ్ఞతగా వుంటుంది. (నలువైపులా పరికిస్తూ) అరే! మరచి పోయినాను. పోయి సంధ్యావందనం చేసుకోవాలి. వెళ్లొస్తారా.

నా :- సరేరా, నువ్వు పో. రాక రాక నేను యివ్వాళ యీ వుద్యానవనంలోకి వచ్చాను. ప్రకృతి కాంత

సౌందర్యాన్ని కాస్త యింకా జుర్రుకుంటూ, రోజూ ఆ పాడు దుకాణానికెళ్ళి కూర్చోటమేగా. ఇవాళ కాస్త ఆలస్యమైతే మించిపోయే దేమీ లేదు.

మి :- అల్లానే, నీ ఇష్టంరా. నే వెళ్ళివస్తారా.

నా :- సరేరా.

— ఇద్దరు చెరో వైపుని ప్రక్కమిస్తారు.
తెరదించబడి వెంటనే ఎత్తబడాలి—

(ఒకవైపునుంచి అశ్వఘోషుడు ప్రవేశిస్తాడు. అక్కడున్న శిలా వేదికపై కూర్చుంటాడు. గిరజాలజుట్టు. వయస్సు 25 వత్సరాలు. పూర్తిగా సిల్కుదుస్తులు. దుఃఖసాగరంలో మునిగియున్నట్లు కనబడుతాడు. నేపథ్యంలోనుంచి ఒక గేయం పాడబడుతూంది. ఊర్వశి మాయమైంది. పురూరవుడు పర్వతఅరణ్యాల్లోనూ, నదీనదముల లోను, వాటికలలోను, కుంజలతావనములలోను, అన్వేషిస్తూ తిరుగుతూ ఉంటాడు. ఇది ఊర్వశీ వియోగగానం, అశ్వఘోష్‌ని కళ్ళనుండి కన్నీళ్ళు జల జలా రాలుతుంటాయి. పాట పూర్తియైన కొద్దిక్షణాలకు ఒక గ్రీకుయువకుడు ప్రవేశిస్తాడు. పేరు బుద్ధప్రియుడు. అదే వయస్సు. అడుగుల సవ్వడివిని అశ్వఘోష్‌డు ఉలిక్కిపడి దబదబా కళ్ళు తుడుచుకుంటాడు. అతనికళ్ళు ఎఱ్ఱబారి యున్నవి.)

బుద్ధప్రియుడు :- నమోవాక్కులు. ఎంతపెద్ద కవులు మీరు?

అశ్వఘోష్‌డు :- (రెప్ప లార్పుతూ, గొంతు సరించుకొంటూ)_
కవినా! నేనా! నమస్కారము. గొప్పకవినా! కాదు,

అధమకవిని. కాదు కాదు, నేను అధమాధమ కవిని. ఆఁ! మీ పరిచయం ?

బు :- నన్ను బుద్ధప్రియు డంటారు. నేను యీ సాకేతనగర గ్రీకు నాటక సమాజ సంచాలకుణ్ణి.

అ :- అలానా ? సంతోషం, చాలా సంతోషం. మీకు నేను ఏంసేవ చేయగలను ?

బు :- నన్ను చెప్పనీయండి. మీపట్ల మాకందరికీ వున్న శ్రద్ధాభక్తులను పురస్కరించుకొని మీ వద్దకు వచ్చాను. ఇచట మా గ్రీకులకు ఒక నాట్యశాల వుంది.

అ :- (సంతోషంతో) - నాట్యమా ? నాకుగూడా నాట్యకళ అంటే చాల యిష్టం.

బు :- అదేకాదు, తరచు నాటకాలుకూడా ప్రదర్శిస్తూ వుంటాము.

అ :- ఓహో ! నాటకాలా ?

బు :- అవును. మా గ్రీకుల నాటకాలలో ఒక విశిష్టత వుంది. దేశకాలపరిస్థితులను తెలియజేయటానికి, రంగస్థలం మీద మా నాటకాలలో పెద్ద పెద్ద తెరలుంటాయి. అన్ని ఘట్టాలను వాస్తవికరూపంలో చూపుటకు ప్రయత్ని స్తూంటాము.

అ :- (నిట్టూర్పుతో) సాకేతపౌరుడనై యుండి కూడా ఒక్క సారైనా మీ నాటకం చూడటానికి నోచుకోలేకపోయేను.

ఎంత దురదృష్టవంతుణ్ణి నేను ? (మళ్ళీ నిట్టూర్పు విడుస్తాడు)

బు :- క్షమించండి. ఆ తప్పు మాదే. అందులకు క్షంతవ్యులము. ఇంతవరకు. మా నాటకాలు గ్రీకు దేశీయులకు, మరికొద్దిమంది వారి సన్నిహితసంబంధీకులకు మాత్రమే అందుబాటులో వుంటూ వచ్చాయి. అందువల్ల సాకేతలోని తమలాంటి విద్వాంసులకు, గ్రీకుల నాటకాలసంగతి తెలిసే అవకాశం లేకపోయింది.

అ :- (నవ్వి) మరైతే, అందరికీ అందుబాటులో వుండే నాటకాలు ఎందుకు ప్రదర్శించకూడదు, మీ సమాజాలు ?

బు :- కృతజ్ఞుణ్ణి. మీ సలహా మా సమాజంముందు తప్పక పెడతాను. యీసారి మా నాటక ప్రదర్శనం మీరు తప్పక వచ్చి చూడాలని మా అందరి అభిలాష.

అ :- సంతోషం, చాల సంతోషం. నన్ను ఆహ్వానించినందులకు మీకు, మీ సమాజ సదస్యులకు, నా కృతజ్ఞతా పూర్వక అభివందనాలు అందజేయండి.

బు :- (తలగోక్కుంటూ) తప్పకుండా. మీరు మా ఆహ్వానాన్ని స్వీకరించినందుకు మా ధన్యవాదాలు. (కాస్తఆగి) ఒక మనవి వుంది.

అ :- యథాశక్తి మీ మనవిని మన్నించటానికి ప్రయత్నం చేస్తా.

బు :- మీరు ఊర్వశీవియోగ ఇతివృత్తాన్ని తీసుకొని మా

కోసం ఒక నాటకం వ్రాసి పెట్టరూ?

అ :- నేనా! నాటకము వ్రాయటమా! ఇంతవరకు నాటకాలు వ్రాయడంలో ప్రవేశం కలుగలేదే?

బు :- ఘోష్ గారూ, మీలో ఆ సామర్థ్యం వుందని మా అందరి విశ్వాసం. ఇన్నాళ్లు గ్రీకు నాటకాలను మేము ప్రదర్శిస్తూ వచ్చాము. ఇక ముందు మీ దేశపు - మరి చాను - మన దేశపు కథలను ఆధారం చేసుకొని కొన్ని నాటకాలు మీలాంటి విద్వాంసుల చేత వ్రాయించి ప్రదర్శించాలి అని మానాటకసమాజం నిర్ణయం చేసుకొన్నది. తమరిని యీ విషయంలో ప్రార్థించ వలసినదిగా నన్ను మా సమాజం పంపించింది. (అశ్వఘోష్ ఏదో ఆలోచిస్తూ ఉంటాడు) యథాశక్తి తృణమో పణమో తప్పక సమర్పించు కొంటాములెండి.

అశ్వ :- దానికేం లెండి. మీరు సెలవిచ్చారు కాబట్టి ప్రయత్నం చేసిచూస్తా.

బు :- అల్లాఅంటే ఒప్పుకోనండి. వ్రాసి తయారుచేస్తాను అని అనాలి తమరు.

అ :- (చిరునవ్వు నవ్వుతూ) - సరే వ్రాసి పెడతాను.

బు :- (ఉల్లాసముతో) చాలా కృతజ్ఞులం మేము, మీకు కృతజ్ఞులం. మీ లాంటి కవి తలుచు కొంటే, గ్రీకు నాటకాలకంటె ఉత్తమమైన నాటకాలను రచింప గలరని మా కందరికి మీలో నమ్మకం వుంది.

అశ్వ :- అపచారము-అపచారము (లెంపలు వాయించుకొంటూ) ఆ మహామహులతో నావంటి అల్పుణ్ణి పోల్చటమా ? వారికీ నాకూ హా స్తిమశకాంతర మున్నది. మీ గ్రీకు నాటకరచయితల వద్ద శుశ్రూష చేయవలసినవాణ్ణి నేను.

బుద్ధ :- (ఉల్లాసం ఎక్కువౌతుంది) తమరి నమ్రత ఎంతైనా శోభాయమానంగా వుంది. (కొస్త ఆగి) మరో చిన్న మనవి. పురూరవుని పాత్రను తమరే నిర్వహించాలి.

అ :- (పకపక నవ్వుతూ) మొదటేమో నాటకం వ్రాసిపెట్ట మన్నారు. ఇప్పుడు ఆ నాటకంలోని నాయకుని పాత్రను నన్ను ధరించమంటున్నారు. బాగుంది!.

బు :- నన్నేంచేయమంటారు ? అల్లా అని మా సమాజం ఏకగ్రీవంగా నిర్ణయానికి వచ్చింది.

అ :- (నవ్వుతూ) మరీబాగుంది! నా అంగీకారంతో నిమి త్తం లేకుండానే మీ సమాజం నిర్ణయాలకు రావటం, అవి నా నెత్తిమీద రుద్దడమూనా ? బాగుంది.

బు :- తమరు సహృదయులనీ, రసికశేఖరులనీ, కవికుల మార్తాండులనీ, మాకందరికీ తెలిసివుండబట్టే యీనిర్ణయా లకు వచ్చాం. తటపటాయించకండి. కొద్దిమాత్రపు అభ్యాసంతోనే తమరు బాగా నటించగలరని మా అందరి విశ్వాసం.

అ :- సరే, ఇంక తప్పేదేముంది? రోటిలో తలదూర్చాను, రోకటిపోట్లు తినాలిగా.

బు :- ఎంత అదృష్టవంతులం! ఇంకో చిన్న మనవి.

అ :- ఇంకోటా? సరే. ఏమిటది?

బు :- మీ ఇతివృత్తానికనుగుణ్యంగా తెరలు తయారు చేయడంలో కూడా తమరు సాయపడాలి. తెరల మీద పురూరవుని దేశాన్ని చిత్రించాలి. నాకూ చిత్రకళలో కొంత ప్రవేశమున్నది. మీ సలహాలతో యీ పనిని సులభంగా పూర్తిచేయగలమని నాకు విశ్వాసముంది.

అ :- సరే మహాశయా, మీ ఆజ్ఞలన్నీ శిరోధార్యం.

బు :- నటీనటకుల వస్త్ర, వస్తు, భూషణాలను గురించి మీ సలహాలన్నీ పాటిస్తాము.

అ :- మీరు చాలా తెలివిగలవారు. ఆ నాటకానికి నేనే దర్శకత్వము వహించాలని చెప్పకుండా నాచేత ఒప్పించేశారు.

బు :- చిత్తము.

(అశ్వఘోష్ పరధ్యాన్నంగా అటు యిటూ చూస్తూ వుంటాడు.)

బు :- ఊర్వశి పాత్ర ఎవరు వేస్తే బాగుంటుందండీ?

అ :- నాకేం తెలుస్తుంది? నాయకుని పాత్రవిషయంలో నిర్ణయానికి వచ్చినవాళ్ళు, నాయికా పాత్రధారణ విషయంలో ఏ నిర్ణయానికి రాకుండా ఉన్నారంటే నమ్మగలనా? నిజమెందుకు దాస్తారు? చెప్పండి మీ నిర్ణయం.

బు :- నిజాన్ని మీరు ఇట్టే ఆకట్టేశారే! ఆ నాయికా పాత్ర మా ప్రభ వేస్తే ఎల్లావుంటుందండి?

అ :- (తన ఉద్రేకాన్ని, సంతోషాన్ని, అణుచుకొంటూ) ఆమె విగ్రహాం బాగా ఉంటుంది. ఆమె బాగానే నటిస్తుందని నాకు తోస్తూఉంది.

బు :- మీరు సరిగ్గా గ్రహించారు. ఇదివరకే ఆమెకు నాట్య కళలో అనుభవం వుంది. ఆమె నటనా కౌశల్యాన్ని సామాజికులు వేనోళ్ళ పొగుడుతూంటారు. ఇంకేం? ఆమెనే ఊర్వశిగా నిర్ణయిద్దాం. మీ అమూల్యకాలాన్ని నేను తీసుకొన్నాను, క్షమించండి. ఇంక నేను సెలవు తీసుకోనా!

అ :- మంచిది, నమస్కారము. మీ సమాజ సదస్యుల కందరికి, నా కీ సదవకాశం కలిగించి, నాచేత యీ సేవ చేయించుకుంటున్నందులకు నా ధన్యవాదాలు తెలియ జేయండి. (అటు ఇటు చూచి) ఇంక సెలవా?

బు :- (నమస్కరించి) సెలవు. (వెళ్ళిపోతాడు.)

అ :- (నలువైపులా చూస్తూ గంభీరంగా) 'అంతా ఈశ్వరసంకల్పం, కాలగర్భంలో ఏం దాగివుందో'

(అంటూండగా తెరపడును.)



# రెండవ దృశ్యము

(సాయంకాలం. ఆ ఉద్యానవనంలోనే సాయంకాల వర్ణన చేస్తూ ఒక గేయం నేపథ్యంలోంచి పాడాలి, గేయాంతంలో తెర ఎత్త బడాలి. చెట్టపట్టాలేసుకొని నాగూ, మిత్రిలు ప్రవేశిస్తారు.)

నాగు :- మిత్రా, ఆ గేయంకూడా మన ఘోష్‌మహా శయులే వ్రాశారా?

మిత్రి:- ఆఁ. యింకెవరు వ్రాయగలరు?

నాగు :- మిత్రా, మన ఘోషు ఉర్వశీ వియోగ నాటకం ఎంత బాగా వ్రాశారు?

మిత్రి :- నాగూ! నీ నీరస జీవితంలో కూడా సరసత్వం ప్రవేశిస్తున్నందుకు నాకెంతో ఆనందంగా వున్నది.

నాగు :- చూడు మిత్రా! ఇప్పుడు నాకు జీవితంలోని మాధుర్యం, సాహిత్యంలోని స్వారస్యం, బోధపడుతూంది. దీనికంతకూ మూలకారణం నువ్వే. మిత్రుడవంటే నువ్వేరా మిత్రా.

మిత్రి :- (నవ్వి) నాగూ! నన్ను నువ్వూ, నిన్ను నేనూ పొగడుకుంటూ కూర్చుందాం. పరస్పర ప్రశంసా సమాజాన్ని స్థాపించామని లోకులంతా మనలను మెచ్చుకుంటారు.

నాగు :- నిజం చెప్తున్నాను, లోకమేమంటేనేం? 'లోకులు పలుగాకులు.'

మిత్రి :- ఓహో! అంతవరకు వచ్చిందీ అబ్బాయిపని? నీకు నిజంగా కవిత్వం అబ్బుతూందిరా. కొంపతీసి గురువుకి పంగనామాలు పెట్టవు కదా ?

నాగు :- నేను తినేది అన్నం, గడ్డి కాదు. ఫలానా మిత్రి గారి మిత్రుడు నాగుకూడా కవిత్వం వ్రాస్తున్నాడంటే నీకేగదరా ఆ గౌరవం దక్కేది ?

మిత్ర :- 'శిష్యాదిచ్ఛేత్ పరాజయం' అన్నారు పెద్దలు. నువ్వు నన్ను మించిపోతే నాకు నిజంగా గర్వకారణమే.

నాగు :- అరే! ఏమిటీ మరపు? అన్నట్లు గౌతమ బుద్ధులు 'ప్రమాదో మచ్చునోపదం' అన్నారు.

మిత్రి :- ఆ వాక్యానికి అర్థమేమిటోయ్, దద్దమ్మా?

నాగు :- ఆఁ అల్లా దారికి రా. వైశ్యులని మామీద ఒంటి కాలు మీద లేస్తున్నావే? ఉండు. ఆఁ! జాజిలియను మీ బ్రాహ్మణ పండితుడు, తులాధరుడనే మా వైశ్యుని వద్ద జ్ఞాన సంపాదన కోసం వెళ్లినాడని భారతంలో వుంది. ఆఁ మా వైశ్యులంటే ఏమనుకొన్నావో ?

మిత్రి :- లెంపలు వేసుకొంటున్నారా నాగూ? క్షమించు.

నాగు : - ఇన్నాళ్లు నీ స్నేహంచేసి ఆ మాత్రం దానికి అర్థం తెలియదనుకున్నావా? అంతేలే, బ్రాహ్మణ దర్పం పోనిచ్చావుగాదు. నేనూ, ద్విజుణ్ణే. దాని కర్థం ! మరపు చావునకు పర్యాయపదం, అని. (తల గోక్కుంటూ)

అరే! చెప్పాల్సింది చెప్పలేదు. ఊర్వశీ వియోగ నాటకం ఎంతచక్కగా వేశారు! ఘోష్‌గారి ధర్మమా అంటూ మనకు కూడా నాటకంచూచే అవకాశం దొరికింది. ముందు సంకల్పించింది మనం. అది నెరవేరింది.

మిత్రి :- ఏది నెరవేరింది?

నాగు :- ప్రభా అశ్వఘోష్‌లు నాయికా నాయక పాత్రిలు వేశారుగా.

మిత్రి :- అదా? అవును. యీడూ, జోడూ, బాగా కుదిరింది. ఇప్పుడేగా ప్రథమాంకం ఆరంభమైంది. మనం తలపెట్టిన నాటకం, సుఖాంతంగా పరిణమిస్తుందో లేక విషాదాంతంగా .........

నాగు :- ఏమిటి అప్రిచ్యపు మాటలు? దేవుని దయవల్ల, సుఖాంతం అవుతే మనహనుమన్న గుడికి వెళ్లి పది కొబ్బరికాయలు కొట్టుతా.

మిత్ర :- పదేనా? వంద అనరాదురా? చివరకు తెంపు చేశావు. ధనం కొల్లగా నీవద్ద వున్నందుకు దానిని మంచి ప్రియోజనాలకోసం వెచ్చింప దలచుకొన్నావు. ఏంచేస్తాం? లక్షాధికారివి నువ్వు, నేనో భిక్షాధికారిని. నీకు లక్ష్మీ ప్రిసన్నం, మరినాకో సరస్వతీప్రసన్నం. ఇదంతాపరి పాకానికి వచ్చినతరువాత నేనే యీ దివ్యగాథను నాటకంగా రచించి నా జన్మ సార్థకం చేసుకొంటాను.

నాగు :- సరి, సరి. చూసింది ఒకే ఒక నాటకం. అప్పుడే నాటకం రాద్దామని బుద్ధి పుడుతోందేం? ఓరి మిత్రా, నువ్వేగా చాలాసార్లు చెప్పావు, 40, 45, ఏండ్లు దాటందే, ప్రపంచానుభవం పూర్తిగా కలగనిదే రచించే నాటకం రాణింపుకు రాదని.

మిత్రి :- అవునురా, ఆ వయస్సు వచ్చిన తరువాతనే వ్రాస్తా. (ఇంతలో నాగు ఒకవైపు చూస్తూ) – అరే, అటుచూడు, ఆ శిలావేదికవైపు. మన అశ్వఘోషులు కుంచె చేత్తో పట్టుకొని ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ ఒక ఫలకంమీద ఏదో గీస్తున్నాడు.– పోయి కలుసుకొని, నాటకంరక్తి కట్టినందుకూ, అతను పురూరవునిపాత్ర బాగా అభినయించినందులకూ, మన అభినందనాలు వెలిబుచ్చుదాం.

నాగు :- నీ బుద్ధి బుగ్గయినట్లేవున్నది. అతని ఏకాగ్రతని మనం భంగపరచకూడదు. ఇక్కడ నుంచే అతని దివ్య సుందర విగ్రహాన్ని కాసేపు చూసి మదిలోనే అతనికి అభివందనాలు వెలిబుచ్చి ఏ సవ్వడి చేయకుండా మనం తిరుగు ముఖం పడదాం. (జబ్బపట్టుకొని) రారా! వెళదాం. అలా చూస్తావేం?

(మిత్రి, నాగును జబ్బపట్టుకొని తీసుకొని వెళుతూంటే తెరపడును)

(మళ్లీ తెరఎత్తాలి. అశ్వఘోషుడు కుంచె చేత్తోపట్టుకొని శిలావేదికపై కూర్చొని ఒక ఫలకంమీద ఏదో గీస్తూ మధ్యమధ్యఆలోచిస్తూ అటూ

ఇటూ పరికిస్తూ వుంటాడు. ఉద్యానవనం-అతని ముఖంపై అలసట చిహ్నాలు కనబడుతూంటై ఇంతలో ప్రభ మెల్లగా అడుగు వేసుకుంటూ రంగస్థలం మీదకు వస్తుంది. వయస్సు 18 సంవత్సరాలు. బంగారు వన్నె, అనలంకృత సౌందర్యం. నీలిరంగు పట్టుచీర, గులాబిరంగు కంచుకం, పూర్తి చేతులది. సాధారణమైన పాంకోళ్ళు, తలచుట్టూ పూలదండ. వెనకాలనుంచే మెల్లగా వస్తుంది చప్పుడు చేయకుండా వెనుకనుంచి చూస్తుంది. కొద్దిక్షణాల తరువాత మెల్లగా దగ్గుతుంది. అశ్వఘోషుడు ఉలిక్కిపడతాడు. (క్రీగంటితో చూస్తాడు. తనూ దగ్గుతాడు.)

ప్రభ :- (భరతనాట్య పద్ధతిలో చేతులు జోడిస్తూ) నమస్తే!
(అశ్వఘోషుడు లేచి నుంచుంటాడు. అతని మొగం చేటంత అవుతుంది)

అశ్వ :- నమస్తే! నమస్తే! ఇలా రా ప్రభా; యీ వేదిక పైన కూర్చో.

ప్రభ :- (అలానే వయ్యారంగా కూర్చుంటూ) ఏమిటండీ? కుంచె చేతులోనే వుండిపోయింది?

అశ్వ :- (దూరంగా చూస్తూ) ఆఁ ప్రాకృతిక దృశ్యాన్ని చిత్రిస్తూన్నాను యింతసేపూ. ఇంతలో నువ్వు వస్తావన్న సమయం జ్ఞప్తికి వచ్చిఁది. నీకోసం ఎదురు చూస్తున్నాను.

ప్రభ :- నయమే. దాంట్లో తన్మయుడవై భౌతిక ప్రపంచాన్ని మరచి పోలేదు.

అశ్వ :- ఏది మరచినా మరువవచ్చు, నిన్నుమాత్రం మరువలేనుగా ప్రభా.

ప్రభ :- చూడు, పురూరవా, ఆఁ ఆఁ - ( నాలుక కరచుకొని) నవ్వుతావేం? నాముఖంమీద కోతులాడుతున్నాయా?

అశ్వ :- కాదు, ప్రభా నీ కోపాభినయం ఎంత బాగుంది? కోపం అరిషడ్వర్గాల్లో ఒకటి. అయినా నీకు మాత్రం కోపం వచ్చినప్పుడు అదిమిత్రవర్గంలో జేరుతుంది. ప్రభా, నీకు కోపం వచ్చినప్పుడు కూడా అంత అందంగా ఉంటావేం?

ప్రభ :- 'సర్వం శోభనీయం సురూపం నామ' - అని అనలా భాస మహాకవి.

అశ్వ :- ఓ! మా నాటకాలన్నీ చదువు తున్నట్లున్నావే?

ప్రభ :- మీ దేశానికివచ్చి స్థిరపడిపోయాం. మరి మీ దేశ సాహిత్యం చదువ వద్దూ?

అశ్వ :- చదువ వలసినదే, అల్లా చదివినప్పుడే మా దేశ ప్రజల ఆత్మ మీకు అవగాహన మాతుంది. సరేగాని, ప్రభా, నా నాటక మెలా వుంది?

ప్రభ :- పుల్లగా, చేదుగా వుంది.

అశ్వ :- అంతేనాపిల్లా? దానితోపాటు కారంగా, ఉప్పగా, తీపిగాకూడా లేదూ?

ప్రభ :- అన్ని రుచులూ ఉన్నాయి. కాని నాటకంలో, 'పిల్లా' అంటే జ్ఞప్తికొచ్చింది. పిల్లాఅని నీవు వ్రాసిన

గేయం అందరూ పాడుకుంటూంటారు. ఆ పాట నీ నోట నాకు వినిపించవూ?

అశ్వ :– (బిగ్గరగా నవ్వుతాడు) నీ ముందు నేను పాడడమా? ఏం? నన్ను ఎగతాళి పట్టించ దలుచుకొన్నావా? తెలుసులే మహా! నీవు కోకిల కంఠివని.

ప్రభ :– (మారాం చేస్తూ) – తెలుసులే మహా! నువ్వు కూడా బాగా పాడతావని. ముందా పిల్లమీద పాట పాడి వినిపిస్తావా లేదా?

అశ్వ :– వినిపించను అంటే?

ప్రభ :– నీకు తెలియదూ! నేనేం చేస్తానో? వచ్చిన దారినే వెనక్కి వెళ్లుతా.

అశ్వ :– అంతపనీ చేయగలవు. పాడతాలే, విను.

రావె, రావె, రావె, పిల్లా
నా రాణి వౌదువు కాని ॥రావె॥

నా కంటి వెలుగే నలుగు,
మంచు ముత్తెములే జిలుగు,
చుక్కలే కొప్పులో పూలు,
పట్టుపురు వే నీదు బొట్టు ॥రావె॥

నా పలుకులే లోలకూలు,
నా తలపులే కాసుల పేర్లు,

నా కలలే కనకపు కంటె,
నా బాసలే చేతి మురుగూలు ॥రావె॥

ఇంద్ర ధనువులోని కెంపూ,
నీ అడుగులకే బహు యింపూ,
నీ ఒలుకులే నగవుల బాట,
నా కంటి కొలకుల పాట ॥రావె॥

నీ తోడిదే నాకు లోకం,
నీవు లేక నాకు నరకం! !
నీ వలపు కైపు చే నా కైత
కమ్మతావుల సరిపోత. ॥'రావె'॥

ప్రభ :- (చప్పట్లు కొడుతూ) నీ పాట అద్భుతంగా వున్నది. దీనినే యువతీ యువకుల జంటలు, ఎక్కడ పడితే అక్కడ పాడుతూ వుంటారు. నే నెన్నోసార్లు విన్నాను. కాని, నీ నోట ఆ పాట అమోఘం! అనంతం!! అద్వితీయం!!!.

అశ్వ :- చాల్లే, నీ పొగడ్తలు, నువ్వూను. ఇల్లా పొగడే, పైకి రావలసిన కవుల నెందర్నో చెడగొట్టారు మన ప్రజలు.

ప్రభ :- తర్కశాస్త్ర నిష్ణాతవు నీవు. ఆడదాన్ని నేను. నీతో వాదనలో గెలవ గలనా?

అశ్వ :- అలా ఒప్పుకో, పురుషుడి ఘనత.

ప్రభ :– సరేగాని, నాదొక ప్రశ్నవుంది. జవాబు చెబుతావా?

అశ్వ :– మీరు సెలవీయడం, నేను వేరేలా చేయడమునా?

ప్రభ :– మీరేమిటి? నువ్వు అనక. వేషాలు పోతున్నావుమరి!

అశ్వ :– వేషాలు వేసి వేసి అలవాటుగా మారిందిలే ప్రభా!

ప్రభ :– నేర్చుకొన్నావులే, మహాఁ! (గద్దిస్తూ) ఎందుకూ మాటి మాటికి అన్నిసార్లు 'ప్రభా, ప్రభా' అంటావు ?

అశ్వ :– ఏం, ప్రభా, నీకు కర్ణకఠోరంగా వుందా ?

ప్రభ :– ఉండదూ మరి ? నా పేరే నేను ఎన్నిసార్లు వినమంటావు? విసుగెయ్యదూ?

అశ్వ :– అమ్మ దొంగపిల్ల! నా నోట నీ పేరు నువ్వు వినటం నీకు విసుగుగా ఉందా ? మీ బుద్ధదేవునితోడు, నిజం చెప్పు.

(ప్రభ అట్టహాసంగా నవ్వుతుంది.)

ప్రభ :– మాటలలో యిట్టే మరిపించేశావు నువ్వు. మరి ఉర్వశీ వియోగ నాటకాన్ని రచించేటప్పుడు నీ మనస్సులో ఏముంది? చెప్పవూ నాకు?

అశ్వ :– వేశావ్రా, చొప్పదంటు ప్రశ్న? ఏముంటుంది? ఊర్వశీ పురూరవులగాథ.

ప్రభ :– అది నాకు తెలుసులే. ఊర్వశిని అప్సరసా, యని సంబోధించావేం?

అశ్వ :– ఊర్వశి అప్సరస కాబట్టి.

ప్రభ :- అల్లా అయితే నువ్వు పురూరవుణ్ణి, ఊర్వశిని వేరు చేసి అతడు నదీ నదాలు పర్వతారణ్యాలు చెట్లు గుట్టలు, కుంజ గుల్మలతాదులు ఆమెకోసం వెతికినట్లు వర్ణించావేం?

అశ్వ :- ఆ పరిస్థితుల్లో పురూరవుడు అలా సంచరించడం స్వాభావికం గనుక.

ప్రభ :- అది సరేకాని, ఊర్వశీవియోగాన్ని గానం చేసే గాయకుడు లతా గృహంలో అశ్రుధారలను వీణవలెనూ, పాటను సహచరిణి లాగాను చేసుకొన్నాడేం?

అశ్వ :- ప్రభా! గాయకుడుగాని, నటకుడుగాని, తన పాటలంలోనూ తన అభినయంలోనూ తన్మయుడై పోవాలిగా.

ప్రభ :- అబ్బబ్బా! అదికాదు. నీవు నాకు సరిగ్గా సూటిగా జవాబు చెప్పడంలేదు.

అశ్వ :- అబ్బబ్బా! నీ అభిప్రాయం నాకు తెలియడమే లేదు.

ప్రభ :- చాలులే, నీవెక్కిరింతలు నువ్వూను. నిజంచెప్పు, నువ్వు పురాణాల్లోని ఊర్వశీ వియోగాన్నిగురించి పాడలేదు, పాడలేదు, పాడలేదు. కాదూ?

అశ్వ :- (తలవంచుకొని మౌనంగా వుంటాడు. తలఎత్తి ఆమెకళ్లవైపు చూస్తాడు.)

ప్రభ :- దొంగ దొరికిపోయాడు. నీ ఊర్వశి నీ హృదయంలోనే వుంది. ఆమె అప్సరసఅంటే, సరయూనదీ జలాల్లో యీతకొట్టేది, అవునా?

అశ్వ :- (నిట్టూరుస్తూ) ఆఁ ఇంకా.

ప్రభ :- ఆ ఊర్వశియొక్క పురూరవుడు కొండల్లోనూ లేడూ, కోనల్లోనూ లేడు.

అశ్వ :- ఎక్కడున్నాడేం, మరి?

ప్రభ :- యీ సాకేతంలోనే, సరయూనదీ తీరాన్నే, పుష్ప వాటికా వనాల్లోనే, యిచ్చటి లతా భవనాల్లోనే, పాపం వెతుక్కుంటూ తిరుగుతూ వున్నాడు.

అశ్వ :- ఊఁ సరే, యింకా.

ప్రభ :- ఇంకా ఏముంది? అతని అశ్రుకణాలు పురాణ పురూరవునివి కావు. రచయిత తన హృదయావేదనను చల్లార్చుకొనడానికి అల్లా వ్రాశాడు. అవునా?

అశ్వ :- సరేలే ప్రభా. ఇంతసేపూ నువ్వు చెప్పావు. ఇక నన్ను చెప్పనిస్తావా?

ప్రభ :- చెప్పు. ఇదేమిటి చెప్మా! ఒకటే వాగేస్తున్నాను 'వసపోసిన పిట్టలా'. ఇక నువ్వు చెప్పు, వింటా.

అశ్వ :-ఆ సుదినాన, ఆకర్షవంతమైన నీ విశాలనీల నేత్రాలను చూచాను ప్రభా.

ప్రభ :- (నిండు ప్రేమతో) ఆ నాటి నీ దివ్య సంగీతము నన్ను వ్యాకులపరిచింది ఘోష్.

అశ్వ :- ప్రభా! ప్రభా! నీ విరహామే ఆ నాగేయానికి కారణం.

ప్రభ :- హో, ఘోష్, నీ పాటలోని ఊర్వశి పాషాణ హృదయ.

అశ్వ :- అవును. వ్యాకులంగానూ, నిరాశా పూరితం గానూ ... ... ...

ప్రభ :- ఎందుకలా చిత్రించావు?

అశ్వ :- (నెమ్మదిగా నిట్టూరుస్తూ) - ఆమె మెరపువలె మెరసి మాయమైంది. ఆమె అపురూప సౌందర్యాన్ని ఇంకెన్నడూ నేను దర్శించలేను. (మళ్లీ నిట్టూర్పు) ఎప్పుడో ఆమె నన్ను మరచిపోయింది.

ప్రభ :- (బిగ్గరగా) కవీ! ఇంత అల్పుడవా నువ్వు?

అశ్వ :- ఆత్మవిశ్వాసం పూర్తిగా నశించి పోయినపుడు మానవుడు తనని అల్పుణ్ణిగా ఎంచక మరేం చేయగలడు?

ప్రభ :- ఘోష్, ఒక్క సాకేత నగరంలోనేకాదు, మన భరతవర్షంలోనేకాదు, విశాల ప్రపంచంలోగల కవుల్లో మహాకవివి నువ్వు. ప్రతి పౌరుని నాలుకమీద నీ పాట నర్తించిందులాడుతూ వుంది. సాకేతంలోని కన్నెలందరు నిన్నే తమ ప్రియుణ్ణిగా చేసుకోవాలని ఉవ్విళ్ళూరుతున్నారు.

అశ్వ :- (పెదవి విరిచి) ప్చ్ - ఏంలాభం ప్రభా? నాకు మాత్రం ఆ నా ఊర్వశియే సర్వస్వం. రెండువారాలు

మాత్రమే ఆమెనాకంట కనపడలేదు. నాజీవిత గగనంలో నలువైపులా చిక్కని చీకటి క్రమ్మసాగింది. ప్రభా! మీ బుద్ధదేవుని తోడుగా చెపుతున్నాను. యీవారం నిన్ను నేను చూడక పోయినట్లయితే నేనేమైపోయేవాణ్ణో!

ప్రభ :— కవీ, నువ్వుగూడ యింత స్వార్థపరుడవా? నువ్వీ భరతవర్షపు మహాకవివి; అమర గాయకుడవు; నాటక కవితా చక్రవర్తివి. నీ— కాదు— మన ప్రియమైన మాతృభూమి నీయందు ఎన్నెన్ని ఆశలు పెట్టుకొంది? నువ్వు రచించిన ఊర్వశీవియోగ నాటకం ఎంతగా పొగడ బడుతూందో తెలుసా నీకు?

అశ్వ :— నేనేమీ వినడంలేదు; వినలేదు; వినలేను.

ప్రభ :— గ్రీకువ్యాపారి నా బంధువొకడు భరుకచ్ఛంనుండి యిక్కడికి వచ్చియున్నాడు. గ్రీకులు అప్పుడే నీ నాటకాన్ని అనువాదంచేసి యీజిప్టు రారాజువద్దకు పంపించారుట. అక్కడున్న పండితప్రకాండులంతా నిన్నెంతగానో మెచ్చుకొంటున్నారు. అతని మాటలు వింటూవుంటే, నా హృదయం ఎంతో గర్వోల్లాసంతో ఉప్పొంగిపోయింది.

అశ్వ :— నాపట్ల నీకుగల అభిమానమే నాకుసర్వస్వం ప్రభా! అది వినా నాకేమీ తెలియదు.

ప్రభ :— మహాకవీ, నీవిలువ నీకు తెలియదుకదా.

అశ్వ :— నీ చలువవల్ల యిప్పుడు నాకు కాస్త తెలిసింది.

నీవే నా నికషానివి, నా గీటురాయివి ప్రభా.

ప్రభ :— కాదుఘోషా, నువ్వల్లా భావించడం భావ్యంకాదు. యీ యుగంలోకల్లా ఉత్తమోత్తమమైన కవి అశ్వఘోషుడు వేరు; ప్రభా ప్రియుడైన అశ్వఘోషుడు వేరు. ప్రభాప్రియుణ్ణిమాత్రం నీ యిష్టమొచ్చినట్లు చేసుకో, అది నీసొత్తు కాబట్టి. కాని కవివరేణ్యుడైన అశ్వఘోషుడు మాత్రం ప్రపంచం ప్రజలసొత్తు అని గుర్తించుకో. నామాటలు మూటకట్టుకో.

అశ్వ :— నాకు నా యిష్టం అనేదిలేదు. నువ్వే నాయిష్టం. కాదు, నీ యిష్టమే నాయిష్టం. నీ యిష్టము వచ్చినట్లే చేస్తాను ప్రభా!

ప్రభ :— (ఉబ్బి తబ్బిబ్బవుతూ, ఆనంద నృత్యం చేస్తూ) - (ఒకపాట నేపథ్యంనుంచి వుండాలి) అబ్బ! అబ్బ! ఎంతటి అదృష్టవంతురాలను నేను యివ్వాళ!! ఇంతటి అదృష్టవంతురాలను యింత త్వరగా అవుతానని కలలో కూడా ఎప్పుడూ అనుకోలేదుగదా?

అశ్వ :— ఏం, ప్రభా అల్లా అన్నావు?

ప్రభ :— నీవు నన్నీపాటికి మరచిపోయి వుంటావని అనుకున్నాను.

అశ్వ :— మరచిపోవడమా? నిన్నా? నేనా? ఎంతటి పిచ్చిదానవు? హుఁ అది సంభవమేనా?

ప్రభ :— ఏమో అల్లా అనుకున్నా.

అశ్వ :- నువ్వు ఒక అసామాన్య దైవీసంపదవని పాపం నీ కెల్లా తెలుస్తుంది?

ప్రభ :- చాల్లే ఎవరైనావింటే నవ్వి పోతారు. నా సంగతి నాకు తెలుసు. నీ ఎదుట ఎల్లప్పుడూ నేనొక సామాన్య వనితనే.

అశ్వ :- ప్రభా! చెప్పేస్తున్నా చివరికి. కవిత్వమనే క్రొత్త వరప్రసాదాన్ని నువ్వేనాకు ప్రసాదించావు. నిన్నుచూచిన తరువాత నా కవిత్వ ధోరణిలో క్రొత్త పోకడలు గోచరిస్తున్నాయి. నా నాటక రచనకి నువ్వే కారణం. నాకు కలిగిన ప్రేరణ అంతా నీవల్లనే. నా నాటకాన్ని అందరి సొత్తుగా చేసేస్తున్నాను. కాని నిన్ను నేను విస్మరించగలను అని నువ్వు ఊహించడ మేమిటి?

ప్రభ :- ఘోష్! కవీ! మహాకవీ!! నీకు నేను తగిన దానను కాను. నీ సుగుణ గణాలను విన్నతరువాత నేనెంతో నిరుత్సాహాన్ని పొందాను. సాకేతంలోని కన్నెలంతా నీ పేరు విన్నంత మాత్రంచేత పరవశులవడం చూచి మరింత నిస్పృహ చెందాను. అదీకాక, ......... (ఆగుతుంది)

అశ్వ :- (వెల్లబోతూ) అదీ కాక ఏమిటి?

ప్రభ :- నువ్వో ఉన్నత కులీన బ్రాహ్మణ వంశంలో జన్మించావు. నాదో క్షత్రియకులం. అందులోనూ పరాయి గ్రీకు దేశస్థులం. ఇల్లాంటప్పుడు పెండ్లికూతురి పుట్టు పూర్వోత్రాలు అటు నాలుగు తరాలు, ఇటు నాలుగు తరాలు

తరిచి గుణించి శోధించి వివాహానికి ఒప్పుకునే మీ బ్రాహ్మణ ఛాందసులు మన ప్రేమను అంగీకరిస్తారా? అసంభవము.

అశ్వ :- (విచారంతో) అయ్యో! ప్రభా! నీ మెత్తని మదికి అల్లాంటి దారుణ బాధ నాకులం కలిగించింది. ఆ కులంలో పుట్టిన నన్ను క్షమించవూ?

ప్రభ :- (పెదవులు వణుకుతూ) అయితే నువ్వు ప్రభను...

అశ్వ :- (సున్నితంగా ఆమె కుడి హస్తాన్ని పట్టుకొని ఎత్తి అంటీ అంటనట్లు చుంబిస్తాడు) - (తొట్రుపాటుతో) ప్రభా! ప్రభా! నా ప్రభా! అశ్వఘోషుడు అప్పుడూ యిప్పుడూ, ఎప్పుడూ, నీవాడే, నీవాడే, నీవాడే. మృత్యుదేవత కూడా మన యిద్దరినీ వేరు చేయజాలదు; వేరు చేయలేదు; వేరుచేయదు కూడా.

ప్రభ :- ఓ, నా ఘోష్!

అశ్వ :- ప్రభా, నా ప్రభా, నా సుప్రభా, (ఇద్దరి కళ్ల వెంటా కన్నీళ్లు జల జలా రాలుతూంటై. నేపథ్యంలోంచి పాటవినబడుతూంటుంది. తెరపడుతుంది.)



# మూడవ దృశ్యం

(సువర్ణాక్షుని ఇల్లు. తల్లి సువర్ణాక్షి, పుత్రుడు అశ్వఘోషుడు కూర్చుని వుంటారు. తల్లి కత్తిపీటమీద కూరలు తరుగుతూ వుంటుంది. ప్రక్కనే ఘోషు తలవంచుకొని వుంటాడు. సువర్ణాక్షి 45 సంవత్స రాల వయస్సు. వేషం అంతా శుద్ధ వైదీకి ముత్తైదువ.)

సువర్ణాక్షి :- (మృదువుగా) నాయనా! మాట్లాడవేం ?

అశ్వ :- ఏంమాట్లాడనమ్మా ?

సు :- అందరూ ఆ ప్రభను నువ్వు ప్రేమిస్తున్నావని అను కుంటున్నారు. నిజమేనా ?

అశ్వ :- అవునమ్మా, నిజమే.

సు :- ఎంతమందో మనకులంవాళ్లు, లక్ష్మిల్లాంటి తమ కూతు ళ్ళని నీకిస్తామని ప్రాధేయపడుతున్నారురా.

అశ్వ :- అవును, అదీ నిజమే.

సు :- ఎవ్వరినీ చేసుకోను అని భీష్మించుకొని కూర్చుంటే ఎల్లాగరా నాయనా చెప్పు.

అశ్వ :- నేనేంచేసేది అమ్మా ?

సు :- అదికాదురా నాయనా, నా మాట కాస్త విను. ఆరు నూరు అయినా నూరు ఆరు అయినా, మీ నాన్న గారు మాత్రం నువ్వా ప్రభను వివాహమాడ్డానికి సమ్మ తింపరుగదా.

అశ్వ :- నేను ప్రేమించని ఏ కన్యనూ పెళ్ళాడడానికి, నా అంతరాత్మ అంగీకరించడంలేదమ్మా. నేనేం చేసేదమ్మా ?

సు :- అల్లా మంకుపట్టు పట్టితే ఎల్లాగరా నాయనా ?

అశ్వ :- కాస్త నువ్వు ఆలోచించు అమ్మా. వివాహం ప్రేమమీద ఆధారపడివుండాలి. ప్రేమ లేకుండా ఒక అమ్మాయిని పెండ్లి చేసికోనడం నీతిబాహ్యం కాదా అమ్మా ?

సు :- చూడరా నాయనా, మీ నాన్నగారు మొదట నువ్వు నాటకంలో వేషం వేస్తున్నావని తెలియగానే మండి పడ్డారు. నేనే బ్రతిమాలాను, "పోనీయండి ; కుర్రవాడు నాటకాల్లో వేషంవేస్తే కొంపేమీ మునగదులెండీ!" అని. అప్పుడు ఎల్లాగో అల్లా ఆయనగార్ని సమాధాన పరచాను.

అశ్వ :- అదినాకు తెలుసు అమ్మా, అందుకు నీకు నేనెంతో కృతజ్ఞుణ్ణి.

సు :- మరి ఇప్పుడు ఏమంటున్నారో తెలుసా? "కొంప మునగదుఅనీ అఘోరించావు అప్పుడు; ఇప్పుడేమో మన నెత్తిమీదికి తీసుకొచ్చాడు నీ సుపుత్రుడు. 'ఆ తక్కువ కులానికి చెందిన ప్రభను తప్ప ఇంకెవరినీ చేపట్టను' అని మొరాయిస్తున్నాడు. చేసుకొన్నవారికి చేసుకొన్నంత మహాదేవా! ఇంక అనుభవించి ఏడు." అని నన్ను పదే పదే దెప్పుతున్నారా్ర నాయనా!

అశ్వ :- అమ్మా! నీకు నావల్ల చివాట్లు వస్తున్నందుకు నాకు ఎంతో బాధగావుంది.

సు :- ఊరికెనే బాధ బాధగావుందీ అంటే సరిపోతుందా నాయనా? యీ పెడమార్గం పట్టకుండా వుండాలి.

అశ్వ :- ఇది పెడమార్గం కాదమ్మా!

సు :- మరే మార్గంరా?

అశ్వ :- ఇది ఋజుమార్గం, అమ్మా! ఆత్మసాక్షిగా నమ్మిన మార్గం ఎన్నటికీ పెడమార్గం కాదమ్మా.

సు :- ఎల్లా చచ్చేదిరా నాయనా? నువ్వెంత చెప్పినా వినవాయను చూడు నాయనా, మనంపుట్టిందా ఉత్తమోత్తమమైన సత్ బ్రాహ్మణ కులంలో.

అశ్వ :- అమ్మా, అన్నికులాలు సమానమేనమ్మా. శ్రీ కృష్ణ భగవానుడు భగవత్ గీతలో 'చాతుర్ వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః' అని అన్నాడు గదా అమ్మా. కులం – గుణాలు, చేసేకర్మలు బట్టిగాని, – జన్మచేత కాదుగదా.

సు :- ఇది మతానికి విరుద్ధంరా నాయనా.

అశ్వ :- కాదమ్మా! మతాలూ మారుతూ వచ్చినవి. మన దేశచరిత్రచూస్తే ఒక యుగంలో వున్నమతం, మరో యుగాన కుమతం అయింది. ఇదికూడామారుతుందిఅమ్మా.

సు :- శాస్త్రాలు దీనికి ఒప్పుకోవురా నాయనా!

అశ్వ :- అక్కడా పొరబడుతున్నావు అమ్మా. మన పురాణ గాథలలో ఎన్నెన్నో అంతర్ వర్ణ వివాహాలు జరిగేయి అనడానికి బోలెడన్ని నిదర్శనాలు వున్నాయమ్మా.

సు :- ఎల్లా చచ్చేదిరా నాయనా నీతో ? మన యింటా వంటా ఇల్లాంటి విడ్డూరపు పని ఎప్పుడూ జరుగ లేదు.

అశ్వ :- చూడమ్మా, వశిష్టుడు బ్రాహ్మణుడు, అరుంధతి పంచమ కులానికి చెందినది. భీష్ముని తండ్రి శంతనుడు క్షత్రియుడు. శంతనుని భార్య సత్యవతి బెస్తకులంలో పుట్టినది. ఇంతెందుకమ్మా ? సాక్షాత్తూ నరుడు అర్జునుడు క్షత్రియుడు; సుభద్ర గొల్లకులంలో పెరిగిన శ్రీకృష్ణుని సోదరి.

సు :- శాస్త్రంలో ఆడుదాననైన నేను నీతో గెల్వగలనా ? ఘనాపాఠులూ, జటాపాఠులూ నీముందు తర్కంలో, నువ్వుపిల్లవాడివిగా వున్నపుడే 'దాసోహం' అన్నారు. పోనీ, నువ్వు చెప్పేది అంతా బాగానేవుంది అని మాటవరుసకు అనుకొందాం. కాని యీనాడు బ్రాహ్మణులమైన మనం మాత్రం ఆ పద్ధతులను అనుసరించడం లేదుగదా నాయనా.

అశ్వ :- అల్లాగైతే మరీమంచిదమ్మా, బ్రాహ్మణులలో ఒక నవీనమార్గాన్ని నేను ముందు ప్రవేశపెడుతాను. అదే తర్వాత సదాచారం అవుతుంది.

సు :- మీ నాన్నగారికి యీ సంబంధంబొత్తిగా ఇష్టం లేదురా నాయనా.

అశ్వ :- మరి నీకో అమ్మా ?

సు :- నాకా ? (ఆలోచిస్తుంది.)

అశ్వ :- ఆఁ, నీ కమ్మా.

సు :- నాకూ నీ యీ పని నచ్చలేదు.

అశ్వ :- అమ్మా ! చెప్పమ్మా ! ప్రభ అందంగాలేదూ ?

సు :- లేకపోవడమేమిటి ? అంత అందమైన పిల్లను ఇంత వరకూ నేనెక్కడా చూడనేలేదు.

అశ్వ :- సరే అమ్మా, ఆమె ఏమైనా తెలివితక్కువదా ?

సు :- బాగానేవుంది ! నిజంచెప్పాల్సివస్తే, ఆమె అపర సరస్వతీదేవి అని అనిపిస్తుంది, నాకు.

అశ్వ :- మరి ఆమెకు డబ్బు కొరతా ?

సు :- ఆమెతండ్రి యీ దేశంలోని వర్తకులలో శిఖామణి గదా !

అశ్వ :- (తన యుక్తి పనిచేస్తుంది అనే భావంతో) ఆమె శీలవతి కాదా ?

సు :- శ్రీరామ ! శ్రీరామ ! షోడశకళారూపుడైన చంద్రునికైనా మచ్చవుంది, కాని ఆమె కళంకరహిత. ఆమెవైపు వ్రేలు చూపిస్తే పురుగులు పడరూ ?

అశ్వ :- ఇంకేమమ్మా? బాగా నృత్యం చేస్తుంది, పాడుతుంది, నటిస్తుంది, పీటికితోడు అద్భుతంగా పాడుతుంది, శాస్త్ర ఆలోచించి చూడు అమ్మా. ఒక వ్యక్తిలో ఇన్ని సత్ గుణాలుండటానికి అసలు వీలుందా అమ్మా, ఒక్క ప్రభలో తప్ప ?

సు :- (దీర్ఘంగానిట్టూర్పు విడుస్తూ) కాని నాయనా, ఒక్కటే అభ్యంతరము ఆమెకులం వేరు, మన కులం వేరు. పైగా మీా నాన్నగారేమో.........

అశ్వ :- (అర్థోక్తిలో కరుణాపూరితంగా) అమ్మా!

సు :- (అదే బాణిలో) ఏం నాయనా ?

అశ్వ :- నేను బ్రతికివుండాలని నీకుందా అమ్మా ?

సు :- శ్రీరామ! శ్రీరామ! అదేం ప్రశ్న? నువ్వు కలకాలం జీవించాలనే ఆ పరమేశ్వరుణ్ణి నిత్యం ప్రార్థిస్తూ ఉన్నాను.

అశ్వ :- అమ్మా! ప్రభ నా ప్రాణం, కాదు కాదు ప్రాణం కన్నా మించినది. ప్రభయే నాకు జీవితం. ఆమెను ప్రేమించినప్పటినుంచీ నా రచనలలో ఒక నూతనత్వం, ఒక అమృతత్వం ద్యోతకం అవుతోంది.

సు :- నిజమే నాయనా. ఒప్పుకుంటా. అప్పటినుంచే నీ కవితా చంద్రికలు మనదేశపు పొలిమేరలు దాటి చప్పన్న దేశాలలో, వాడవాడలా అన్నిదిక్కులా ప్రసరిత మౌతూ వున్నవి.

అశ్వ :- అమ్మా! (నెమ్మదిగా) ప్రభ లేనిదే నాకు బ్రతుకు లేదు. నేను బ్రతుకలేను. ఆమె నెన్నటికీ విడువలేను; ఆమెను మరువలేను. ఆమె లేకపోతే నేను వృత్త జీవచ్ఛవాన్ని. (హఠాత్తుగా ఆమె పాదాలను తాకుతూ) అమ్మా! ఒకసారి జన్మం ఇచ్చి జననివైనావు. నీ ఋణం నే నెల్లానూ తీర్చుకోలేను. మళ్ళీ నన్ను ఆ ప్రభను పాణి గ్రహణం చేసుకోడానికి అనుమతి ఇచ్చి, నాన్నగారిచేత ఒప్పించి, నాకు పునఃజీవిత దానం చేయవూ? (గద్గదికంగా) అమ్మా! ఆ మహాదానం చేయవా అమ్మా?

సు :- (ఆమెకళ్లు చెమ్మగిల్లుతవి, పెదిమలు వణుకుతవి) సరే నాయనా. చిరంజీవుడవై వెయ్యేళ్లు ఆయురారోగ్య ఐశ్వర్యాలతో వర్ధిల్లుగావుత!

(అని తనకుడిచేతిని ఎత్తి అతని శిరస్సుపై వుంచుతుంది. అతడు మోకాళ్ల మీద కూర్చొని తనశిరస్సును ఆమె పాదాల మీదకు వంచుతాడు. అతనికి కన్నీళ్లు కారుతవి. తల్లి కళ్లనుండి నీళ్లురాలి అతని శిరస్సుపైపడతాయి. ఇతని కళ్ల నుండి నీళ్లురాలి ఆమెపాదాలపై పడుతూ వుండగా తెర దించాలి.)

(నేపథ్యంలోనుంచి తల్లిమహిమను పొగడుతూ పాటవినబడాలి.)

❖ ఆమె నవనీత హృదయ, నా యంతరంగ
శాంతిదేవత' ఆశా పథాంతరాళ

---

❖— శ్రీ వేదులవారి గీతం......

పారిజాతమ్ము, ప్రేమజీవనవిభాత
కైశికీగీతి, నాతపః కల్పవల్లి !

ఆమె జగదీశ మకుటాగ్ర సీమనుండి
యుర్విపై జారిన సుధా మయూఖ రేఖ
ఆమె మూడులోకాల కల్యాణమునకు
అవతరించిన పవిత్రానుభావ

మాామె నా జన్మ జన్మ పుణ్యములుపండి
ప్రాప్తమైన కేళీ పరిత్యాగలీల
ఆమె పద సన్నిధానదివ్యస్థలాన
భక్తినమ్రుడనై నిలంబడిన యపుడు
తలపునకువచ్చు నా పేదతనమునాకు

*          *          *          *

'చెలియ ఏ దేవి మంగళాశీస్సుమములు
పరిమళించినవో మన శిరములందు
ఒక తపస్సిద్ధివోలె నేటికి లభించె
నిరువురి మనోరథమ్ముల కేక ఫలము'

అనిన తారళ్య విస్తారితాక్షి యగుచు
'స్వామి ! మన తోటలో నీ వసంతవేళ

పూచిన సుమమ్ము లా దేవి పూజకొరకె'
అనుచు, నా చేయి తనచేత నదుముకొన్న
యామెపదసన్నిధానదివ్యస్థలాన
నాకకల్లోలినీపదన్యాసమునకు
దరవినతమైన హరజటాభరముఁ బోలె
నతుఁడనయ్యె మహామహోన్నతి వహింతు.



# నాల్గవ దృశ్యము

(క్రిందటిదృశ్యం ఇల్లే, సువర్ణాక్షుడు ప్రవేశిస్తాడు. 60 వయస్సు, పొడగరి, గంభీరమైన వదనం, విభూతి లలాటంపైన, గోష్పాదం అంత జుట్టు. అత్తాకోడలంచు ముతక ఖద్దరు. భుజంమీద తడిసిన గావంచా, కుడిచేతిలో జలంతో నిండుకున్న మిల మిల మెరిసే రాగిచెంబు, కాళ్లకు పాంకోళ్లు. వయస్సుకుమించిన విసురుగా ప్రవేశిస్తాడు.)

సువర్ణాక్షుడు :- ఒసేయ్, చూడు (బిగ్గరగా) ఒసేయ్, నిన్నే ఒక్కసారి ఇల్లారావే.

సు :- (లోపలనుంచి) ఆఁ ఆఁ వస్తున్నా; చెయ్యి ఊరుకోలేదు పనిలో మునిగి వున్నానండీ.

సుడు :- ఎప్పుడూ పనేనా? ఇటొక్కసారి రా. (వుద్రేకంగా) రావేం ఇంకా?

సు :- మరీ విడ్డూరమండీ, వస్తున్నానంటే. (అంటూ రంగస్థలం మీద ప్రవేశించి) వచ్చేనండీ (తడిచేతులు చీరకొంగుతో తుడుచుకుంటూ వస్తుంది. వస్తూనే) ఏమిటండీ ? ఏమిటికారాలు మిరియాలు నూరుతున్నారు ?

సుడు :- (బిగ్గరగా) చూశావా? ఎంత అపఖ్యాతి తెస్తున్నాడో నీ సుపుత్రుడు?

సు :- (కొంచెం భయంతో) ఏమిటండీ? ఏం చేశాడండీ?

సుడు :- ఇంకేంచేయాలి? నగరం అంతా కోడై కూస్తూంటే

ఎక్కడకెళ్ళినా మనవాడి ప్రతాపం విపరీతంగా చెప్పుకుంటున్నారు.

సు :— ఓస్ అంతేనాండీ, మన నాయన కావ్యాలు అద్వితీయంగా వుంటున్నాయిగనుక అందరూ వాణ్ణి గొప్పగా చెప్పకోక మరేం చేస్తారు? ఏం; మీకేమన్నా కాస్త అసూయగా వుందా?

సుదు :— (వెటకారంగా) అసూయకూడానా? నీ తెలివి తెల్లవారినట్లేవుంది. ఆ విషయంగాదే నేనంట. నేను సరయూ నదిలో స్నానంచేసి సంధ్యావందనం పూర్తిచేసుకొని ఇంటికి వస్తూవున్నాను. అందరూ అనుకుంటున్నారు: సరయూ నదీ తీరాన, పుష్పవాటికలలో, నాట్యశాలలో, ఎక్కడచూచినా అన్నివేళలా వారిద్దరే ప్రత్యక్షంట. ఆ నటిని మన నాయన నీడలా వెన్నంటుతూ వున్నాడట. ఆమె ఎక్కడ ప్రత్యక్షమైనా, వెనుక మన నాయన ప్రత్యక్షం! బుద్ధిలేకపోతేసరి, వేళకు భోజనానికైనా ఇంటికి వస్తున్నాడా?

సు :— రాకేం? వేళతప్పకుండావచ్చి భోజనం చేస్తూవున్నాడు.

సుదు :— (వెటకారంగా) చేస్తున్నాడూ! మన్ని ఉద్ధరిస్తున్నాడు!

సు :— అదేమిటండీ? లేక లేక మనకొక్కడే పుత్రుడు కలిగేడాయను. అంతగా వాడిమీద కారాలు మిరియాలు నూరడమేమిటి?

ప్రభ

సుదు :– వాడు పుట్టకపోయివున్నా బాగుండేది, యీ అప
నిందేనా తప్పేది.

సు :– శ్రీరామ,శ్రీరామ. అదేంమాటలండీ? ఎవ్వరేనా వింటే
నవ్విపోతారు. వాడికోసమని ఎన్ని తీర్థయాత్రలు చేశాం;
ఎన్ని దానాలు చేశాం; ఎంత తపస్సుధారపోశాం.

సుదు :– అవన్నీ బుగ్గిలో కలసిపోయినాయి. నువ్వే వాణ్ణి
చెడగొడుతున్నావు.

సు :– నేనేంచేశాను మధ్య ? వాడికి వయస్సు వచ్చింది.
'ప్రాప్తేతుషోడశే వర్షే, పుత్రం మిత్రవత్ ఆచరేత్' అని
కదా శాస్త్రకారుని వాక్యం.

సుదు :– తప్పుచేశారు మన పూర్వులు. ఆడవాళ్ళకు చదువు
చెప్పించడమేమిటి ?

సు :– మళ్ళీ చక్రాన్ని వెనుకకు త్రిప్పాలని వుందా మీకు ?

సుదు :– నేర్చేవులే మాటలు. (కాస్త నిదానించి) మరేంచేయ
మంటావు నన్ను ? (వెటకారంగా) నీ సుపుత్రుడు చేసిన
ఘనకార్యానికి మెచ్చి సువర్ణకంకణాలు తొడగ
మంటావా ?

సు :– అదికాదండీ, ఆమె అంటే అతనికి ఎనలేని ప్రేమ.

సుదు :– ప్రేమ లేదు గీమ లేదు, తన్నేవాళ్ళు లేకపోతేసరి.
ప్రేమట ప్రేమ ! నేర్చుకొన్నారు ఒకమాట గడుగ్గాయ
వెధవలు. ప్రభపట్ల నీ సుపుత్రుడికి వుంది ప్రేమకాదు

వ్యామోహం. అంతే. నాలుగురోజులలో ఆ ప్రేమ కాస్తా చల్లారి పూరుకొంటుంది.

సు :- అదికాదండీ. అల్లాంటివాడు కాదు మన నాయన. ప్రభ తనకు తోడునీడగా లేనిదే బ్రతుకలేను అంటున్నాడు.

సుడు :- అందాకా వచ్చిందీ? బ్రతకలేడూ? బ్రతకలేకపోతే వురిపోసుకోమను.

సు :- శ్రీరామ, శ్రీరామ. ఆ అమంగళపు పలుకులేమిటండీ?

సుడు :- మరేంచెయ్యమంటావు? నన్ను వురిపోసుకోమంటావా? నువ్వేనా చెప్పిచూడరాదు?

సు :- మీరు నాకు చెప్పిన యుక్తులన్నీ వాడిముందు ఏకరువు పెట్టేశాను; అన్నిటికి మంచిసమాధానాలిచ్చేడు.

సుడు :- బాగుంది. నిన్నుకూడా తనపథానికి త్రిప్పుకొన్నాడా?

సు :- నాయన చెప్పిందంతా విన్నాను, ఆలోచించాను. వాడు చెప్పినది సమంజసంగానే వున్నట్లు నాకుకూడా తోస్తూంది.

సుడు :- తెలివితక్కువ దద్దమ్మవు, ఎల్లాగో అల్లాగు నచ్చజెప్పి వాడి మనస్సు త్రిప్పవే అంటే నువ్వు వాడికి వత్తాసుగా మాట్లాడుతున్నావా?

సు :- మరేంచెయ్యమంటారు? వాడి పక్షం అంత ప్రబలంగా వుంది.

సుదు :- అందుకే అన్నారు స్త్రీలు బేలలని. అసలు ఆడ వాళ్ళ స్వభావం అంతా అంతేనేమో ! వాడు కన్నీళ్ళు కార్చివుంటాడు, ఇట్టే నీవు కరిగి నీరై యుంటావు.

సు:- (ప్రార్థిస్తూ) లేక లేక ఒక్కగాని ఒక కొడుకు పుట్టేడు మనకు. అప్పుడే జగత్ విఖ్యాతుడైనాడు. సర్వశాస్త్ర నిష్ణాతుడని పేరు తెచ్చుకొన్నాడు, సుగుణ ఆకరుడు. సుశీలవంతుడు, అన్నీ తెలిసినవాడు, వయస్సువచ్చిన వాడు, వాడితో మనకు రగడ ఎందుకండీ ? వాడికోరిక మన్నిద్దాం.

సుదు :- మన్నిద్దాం కోరిక ! నువ్వూ వాడి పక్షం చేరిపో యావు. నీకిష్టంలేదని చెప్పకపోయినావా ?

సు :- చెప్పానండీ. యథాశక్తి నచ్చచెప్పానండీ, అయినా ప్రభనుమాత్రం మరచిపోవడం తన తరం కాదన్నాడండీ.

సుదు :- (కోపంవస్తుంది, కనుబొమ్మలు ఎగరవేస్తూ వుంటాడు. అటు యిటూ తిరుగుతాడు) ఇంతవరకు వచ్చిందీ ? సుడిగుండంలో పడ్డామన్నమాట. (స్వగతం) ఎంత ఆలోచించినా వుపాయమే తోచడంలేదు. ఏంచేయాలి శ్రీరామచంద్రా ?

(ఇటూ అటూ తిరుగుతూ వుంటాడు. ఆలోచన తీవ్రమైంది. తన కుడిచేతితో శిరస్సుయొక్క పురోభాగమును అదిమిపెడతాడు. తిరుగుతూనే రెండవ్రవేలు ఐదవ్రవేలితో కణతలు నిమురుతాడు. యీ లోగా సువర్ణాక్షి లోపలికి వెళ్ళిపోతుంది. నిలబడి ఆకాశము

వైపుకు చూస్తాడు. వదనంమీద గాంభీర్యం తొలగిపోతూంటుంది. మెల్లిగా నవ్వుదొంతరులు వస్తవి. ఒక్కసారి గంతేసి చేతిని తట్టి గట్టిగా అంటాడు.)

సుదు :- (స్వగతం)తట్టింది యిప్పటికి మంచి ఆలోచన. భలే ఆలోచన- (కాని వెంటనే బ్రేకుపడినట్లవుతుంది. అంటాడు.) కాని, నేనాపనిచేయగలనా? నాఆత్మగౌరవము నన్నీపనిని చేయనిస్తుందా? (తిరిగి నిర్ణయానికి వస్తాడు.) తప్పేట్లులేదు. ప్రయోజన సిద్ధికోసం వసుదేవుడంతటివాడు గాడిదకాళ్ళు పట్టుకోలేదా? చేయకతప్పదు. ఇది నా బ్రహ్మాస్త్రం. దీనికి తిరుగులేదు.

(ఇంతలో పావుకోళ్ళ చప్పుడు వినబడుతుంది. ఆ వైపు చూస్తాడు)

(ప్రవేశము అశ్వఘోషుడు - వల్లెవాటు పట్టుశాలువా, చెదిరిన గిరజాలు. కళ్ళల్లో వెలుగు, తన్మయత, ఆనందపరవశత్వం గోచరిస్తూ వుంటుంది. రంగస్థలంమీదకి ప్రవేశించి నడక తీవ్రంచేసి లోపలికి పోబోతాడు.)

సుదు :- (శాంతంగా) అబ్బాయ్!

అ :- (ఆగిపోతాడు, వెనక్కి తిరుగుతాడు) నమస్తే, నాన్నగారూ.

సుదు :- ఇల్లారా నాయనా. (దగ్గరగా జరిగి అశ్వఘోషుడు ఎదురుగా నిలబడతాడు) నువ్విప్పు డెక్కడనుంచి వస్తూంట?

అ :- నాన్నగారూ, నిజం చెప్పనా, అబద్ధం చెప్పనా?

సుదు :- అంతవరకూ వచ్చింది? నిజం చెప్పడం అదివరకు

నీకు సహజంగా వుండేది. అవసరమయితే యిప్పుడు అబద్ధం కూడా ఆడతావన్నమాట.

అ :- (నవ్వి) కాదు నాన్నగారూ, మిన్ను విరిగి నా తలపై పడ్డా అబద్ధమాడలేను. ఇతరులను కాపాడ్డంకోసం మాత్రం అబద్ధం ఆడితీరుతాను. అది శాస్త్రసమ్మతము కూడాను.

సుడు :- అది నాకూ సమ్మతమే. ఇప్పుడు చెప్పు, నువ్వెక్కడ నుంచి వస్తూంట?

అ -: ప్రభ యింటివద్దనుంచి.

సుడు :- అది నాకు తెలుసు.

అ :- మరి తెలిసియుండి అడిగారేం, నాన్నగారూ?

సుడు :- నీ సత్యవ్రతాన్ని పరీక్షిద్దామని.

అ :- నాన్నగారూ, నా మాట మూటకట్టుకోనండి. సత్య దీక్షావ్రతాన్ని హరిహర బ్రహ్మాదులెదురైనా నా బొందిలో ఊపిరి ఉండేంతవరకు విడిచేదిలేదు, విడువలేను గాబట్టి.

సుడు :- పరమసంతోషం. నీతో ముఖాముఖి నా హృదయాన్ని విప్పి ఆ విషయం మాట్లాడాలని ఎన్నాళ్ల నుంచో అనుకొంటున్నాను. ఇక దానికి వాయిదా వేయడం ఆపత్తుకు దారి తీస్తుంది. సరేకాని, మన కులం ఏమిటి?

అశ్వ :- మనది సద్బ్రాహ్మణ కులం.

సుదు :- ఆ ప్రభ ఏ కులంలో పుట్టింది?

అశ్వ :- సత్ క్షత్రియకులంలో.

సుదు :- (కోపంగా) - నేర్చుకొన్నావులే మహా మాట్లాడ్డం.

అశ్వ :- (శాంతంగా) - నే నేమన్నాను నాన్నగారూ?

సుదు :- (కోపంగా) - బ్రాహ్మణకులంలో, ముఖ్యంగా మన కుటుంబం, ఎంతో గౌరవనీయమైన స్థానాన్ని సంపాదించుకొన్నది.

అశ్వ :- నాన్నగారూ, నేను తలపెట్టినపనివల్లకూడా మన కుటుంబ గౌరవం ఇనుమడిస్తుందని నా విశ్వాసం.

సుదు :- తర తరాలనుంచి ఉన్నత కులీన బ్రాహ్మణకులంలో పుట్టిన కన్యలే మనయింట యింతవరకూ కాలుపెట్టుతూ వచ్చారు.

అశ్వ :- నా ప్రభ వాళ్లకేమీ తీసిపోదు. పైగా ఆమె మన యింట కాలుపెడితే మనగృహం, మనవంశం, మనకులం, పునీతమౌతుందని నా నమ్మకం.

సుదు :- నువ్వు వాంఛిస్తున్న యీ వివాహానికి పాల్పడితే మనమేకాక మన ముందు తరంవాళ్లు అధోగతిలో పడతారు.

అశ్వ :- ఇది కేవలం ఒకభ్రాంతి నాన్నగారూ.

సుదు :- (నిశ్చితంగా) మనపదువు, ప్రతిష్ఠలూ, మన గౌరవ మర్యాదలు, మంట కలుస్తాయి.

అశ్వ :- (నిశ్చితంగా) తుమ్మితే ఊడిపోయేముక్కు ఉన్నా ఒకటే లేకపోయినా ఒకటే, ఇంతమాత్రానికే మంట కలిసే గౌరవ మర్యాదలు ఉన్నా ఒకటే లేకపోయినా ఒకటే.

సుదు :- ఆఁ! అంతవరకూ వచ్చిందీ! పోగరుబోతా! గ్రుడ్డువచ్చి పిల్లను ఎక్కిరించిందట.

అ :- నాన్నగారూ! అంతరాత్మ సాక్షిగా నేను నమ్మిన న్యాయమార్గం, నేను చేపట్టిన సత్యమార్గం, అనుసరించటమే పొగరుబోతుతనమైతే యింక నిఘంటువులోని మాటలకు ఉన్న అర్థాలను మార్చాల్సివస్తుందేమో ?

సుదు :- ఆఁ! ఆ నాటకాలదాని వల్లో బాగా పడ్డావు!

అ :- క్షమించండి నాన్నగారు. ఆమెమీదకు విరుచుకు పడటం న్యాయంకాదు. కత్తిమీదకోపం, పాపం గుమ్మడి కాయమీద తీర్చుకోకూడదు నాన్నగారూ. ఆమె సాక్షాత్తూ దేవత.

సుదు :- నా దృష్టిలో ఆమె సాక్షాత్తూ దానవి.

అ :- ఆమెకు సాటి ఆమెయే నాన్నగారూ. అటువంటి వాళ్లు మరిలేరుకూడా. ( తండ్రి చెప్పినమాటలు వినిపించుకోకుండానే )

సుదు :- బ్రతికిపోయాం. ఆమెలాంటివాళ్ళింకా ఎందరో

వుంటే ఇంకా ఎందరు బ్రాహ్మణ యువకులు పతితు లయ్యేవాళ్ళో!

అ :- నాన్నగారూ, నేనే ఆమె ప్రేమను అర్థించాను. ఆమె నన్ను నిరాకరించింది. నేను పదే, పదే ఆమెను ప్రేమభిక్ష కోరగా చిట్టచివరికి అంగీకరించింది. నన్ను ధన్యుణ్ణి చేసింది.

సుదు :- కాదు, తన విషదంష్ట్రలమధ్య నిన్ను చిక్కించు కుంది.

అ :- నాన్నగారూ, ఏమన్నా తూలనాడాలని వుంటే, నన్ను తూలనాడండి. నేను సహిస్తాను, వహిస్తాను. అంతేకాని, ఆమెను ఎవరన్నా ఏమైనా అంటే నేను నా ఓర్మిని కోల్పోతాను.

సుదు :- రోగం ఇంతవరకూ ముదిరిందీ ?

అ :- మీ దృష్టిలో పరమపునీతపు అనురాగం రోగమా, నాన్నగారూ ?

సుదు :- నీతో శాస్త్రార్థం చేయటానికి నాకు తీరికలేదు. కట్టకడకొకమాట అడుగుతాను.

అ :- అడగండి నాన్నగారూ.

సుదు :- నా మాట వింటావా, వినవా ? ఆమెతో స్నేహం మానివేస్తావా మానివేయవా ?

అ :- (దీనంగా) నాన్నగారూ, నన్నెంతో ప్రేమతో

యిన్నాళ్ళూ సాకారు. నన్ను కొద్దికాలంలోనే సకల శాస్త్ర పారంగతుణ్ణి చేశారు.

సుదు :— అదే తప్పయిందేమో చెప్పు. నామాటవింటావా? వినవా ?

అ :— (దీనంగా) నా మనవి ఆలకింపరూ ?— నాన్నగారూ, నా చివరి కోరిక తీర్చరూ ?

సుదు :— ఏమైనప్పటికీ ఆ ప్రభను నువ్వు పాణిగ్రహణం చేసుకోవడానికి వీలులేదు, వీలులేదు, వీలులేదు.

(ఇంతలో సువర్ణాక్షి రంగస్థలం మీదికి మెల్లిగా వస్తుంది. అటు భర్తవైపు యిటు పుత్రుడివైపు విస్తుపోతూ చూస్తూంటుంది.)

అ :— ఆ ప్రభను తప్ప నే నింకెవరినీ వివాహం ఆడలేను, ఆడలేను, ఆడలేను.

సుదు :— కులం చెరపటానికి పుట్టావురా.

అ :— కాదు నాన్నగారూ, బ్రాహ్మణకులంలోని కరుడు కట్టిన కుళ్ళును కడిగివేయటానికి నేను పుట్టాను నాన్నగారూ.

సు :— ఏమిటండీ తండ్రీకొడుకుల మధ్య యీ తర్క వితర్కాలు ?

సుదు :— మా మధ్య నువు కల్పించుకోవద్దు.

సు :— అదేమిటండీ విడ్డూరం ? నేను మీ సహచరిని

గదా, నా ధర్మం నేనూ నెరవేర్చుకోవాలిగా. మన నాయనేమో, వయసువచ్చినవాడు, చదువుకొన్నవాడు. అప్పుడే కీర్తిగడించుకొన్నవాడు. మొన్న మీరు ఇంటిలో లేనప్పుడు ప్రభను మనింటికి తీసుకువచ్చాడు. ఆమెకు అందంతోపాటు సౌశీల్యం వినయమూ, వున్నాయి; బంగారానికి తావి అబ్బినట్లే.

సుదు :- నిన్నుగూడా ఆమె కాటువేసిందీ ?

సు :- ఏం, ఆమె పామనుకున్నారా ?

సుదు :- ఆc ముమ్మూర్తులా.

సు :- శ్రీమన్నారాయణుడు శేషతల్పశాయిగదా. పరమ శివునికి నాగసర్పాలు భూషణాలు గదా.

సుదు :- ఏమిటీఇదీ? యివాళ అందరూ నాతో వాదులాడు తున్నారు. నేను ఆ ప్రభను మన ఇంట్లోకి... ...

సు :- మనవా డంత పట్టుబడుతూవుంటే మనం అడ్డుపడట మెందుకు చెప్పండి ? నే నొప్పుకుంటాను ఆమె మన యింటికోడలు కావడానికి.

సుదు :- (మండిపోతూ) కోడలు! కోడలు! తల్లీకొడుకులు ఒకటైనారూ, ఇంక నే నొంటరిగాణ్ణే. నాకు నువ్వూ వద్దూ, వీడూ వద్దు. ఈ ఇల్లు అసలేవద్దు. ఇంక నేను యీ యింటిలో ఎన్నటికీ కాలు పెట్టను.

సు :- అదేమిటండీ ?

అ :- నాన్నగారూ! నాన్నగారూ! అల్లా అనవద్దండీ, నా గుండె తరుక్కుపోతూంది.

సుదు :- నా నోటినుంచి మాట వెలువడింది. బాణం వదలడమే నా చేతిలోని పనిగాని, తిరిగి వెనక్కి తీసుకోడం నా చేతిలో లేదు. ఈ యింటిలో యింక ఒక్కదినం, ఒక్క ఘడియ, ఒక్కక్షణంకూడ వుండను. చావండి మీరిద్దరూ.

( గబగబా వేగంతో నిష్క్రిమిస్తూ వుంటాడు సువర్ణాక్షుడు. తల్లీకొడుకులుయిద్దరూ అడ్డంపోతారు. బలంగా యిద్దర్నీ చెరోవైపుకు నెట్టేస్తాడు. విసురుగా నిష్క్రిమించాడు. తల్లికి ఏడ్పు వస్తుంది. చీరకొంగుకొస నోట్లో పెట్టుకొంటుంది. అశ్వఘోషునికంటి వెంట నీళ్ళు జల జలా రాలుతూవుంటే కుడిచేత్తో. తలజుట్టును పీక్కుంటాడు.)

సు :- (వెక్కి వెక్కి ఏడుస్తూ తడబడుతూ) - నాయనా! శ్రీరామరక్ష. నేను చనిపోతే పోనీలే, నువ్వుమాత్రం వెయ్యేళ్లు ఆయురారోగ్య ఐశ్వర్యాలతో వర్ధిల్లుదువుగాత! ( అని తనకుడిచేతితో తన పుత్రుని శిరస్సుపై నిమురుతుంది )

అశ్వ :- (దిగాలుబడి నిర్వెరపాటుతో స్తబ్ధుడై నిలబడిఉంటాడు.)

(తెరపడును.)

# అయిదవ దృశ్యం

(ఉద్యానవనం, సాయంకాలం, సూర్యాస్తమయవేళ పక్షులు గూళ్ళకు చేరుకుంటున్నాయి. వాటి కలకలా రావం వినబడుతోంది. సాయంకాలం సౌందర్య వర్ణనపాట నేపథ్యంనుంచే పాడాలి. పాట చివరలో కైలాస్ నాగ్ రంగస్థలంమీద ప్రవేశిస్తాడు.)

నా :—(అటు ఇటూచూస్తాడు) ఇదేవిటి చెప్మా నన్ను ఇక్కడకు వచ్చి కలుసుకుంటానన్న మిత్ర ఇంకా రాలేదు! (అకస్మాత్తుగా అతనిచూపు నలుదిశలా ప్రసరిస్తుంది, ఆ దృశ్యం చూడడంలో మైమరచి ఉంటాడు.)

(సుబోధ మిత్రి ప్రవేశం. ఏదో మాట్లాడబోయి నాగుని తన్మయత్వంచూచి మాట్లాడ్డం మానివేస్తాడు. ఒక నిమిషం తరువాత మెల్లగా దగ్గుతాడు. మళ్లీ దగ్గుతాడు.)

నా :— ( మెల్లగా తల మిత్రివైపుకు తిప్పి) నువ్వా?

మిత్ర :— అవునురా నేనే.

నా :— ( కళ్లు నలుపుకొని కనురెప్పలు మూసి తెరచి ) ఇది కల కాదుగదా.

మిత్ర :— కలకాదురా నాగూ; వాస్తవమే.

నా :— (పూర్తిగా తెప్పరిల్లి) అవును, అవును. కలకాదు ఇది నిజమే. అవునుకాని సూర్యోదయంలోనే లావణ్యంవుంది అనుకొన్నా. కాని ఇవాళ పరమరహస్యం గ్రహించాను.

మిత్ర :—సాయంకాలంలోనూ లావణ్యం వుందనిగదా.

నా :–అదేరా, వయస్సు వచ్చినదగ్గరనుంచి సాయంకాలం వేళ మాకొట్లోకూర్చొని జమాఖర్చు, చిఠాఆవర్జా వ్రాయడం నాకు పరిపాటి. ఇకనుంచి ఆపని మాకొట్లోవున్న బ్రాహ్మ ణయ్యకు వదిలేసి ఇటు తప్పించుకువస్తా.

మిత్ర :– ఒరేనాగూ, మీవైశ్యులకు డబ్బేప్రధానం. డబ్బే సర్వస్వం.

నా :–మమ్మల్ని ఎగతాళిచేస్తున్నావు? డబ్బుకోసమే మేము జీవిస్తున్నట్లు! కాసులు లేకపోతే నానాకష్టాలు పడ తారు ప్రజలు. కాసులు గలవాడె రాజుగదరా!

మిత్ర :– ఏంరోయ్! నువ్వూ కవిత్వం వ్రాసేస్తున్నావు.

నా :– నీ సాన్నిహిత్యం చేసి చేసి యీ మ్రోడులోనుంచి కూడ చిగురుపుట్టుకొస్తూంది. అదంతా నీ ప్రసాదమే. ఆహా! యీ సాయంకాల సౌందర్యము!

మిత్ర :– నాకనిపిస్తోందిరా, యీ ప్రపంచంలో ప్రాతఃకాలం, సాయంకాలం వున్నన్నాళ్ళు, ప్రాతఃకాల బాలసూర్యుని సొగసు, సాయంకాల అస్తంగతభానుని సోయగం వున్నన్నాళ్ళూ, బ్రతుకే ఒకశాశ్వతసౌఖ్యం అని. నా కనిపిస్తోందిరా, ప్రపంచంలో ఎన్నికష్టాలువచ్చినా యీ రెండు వస్తువులు వున్నన్నాళ్ళూ ఎవ్వడికీ బ్రతుకు బరు వుగా అనిపించకూడదని.

నా :– ఏం వరహా మాటలన్నావురా? మా వైశ్యుల్లో

కొందరు దివాలా తీసినప్పుడు ఆత్మహత్య చేసుకొన్న వుదంతాలు కొన్నివున్నాయి. వెధవ డబ్బు, పోతేపోనీ, ఆత్మహత్య చేసుకోవడం ఎందుకురా? యీ రెండూ చూసి బ్రతకవచ్చుగదరా.

మిత్ర :- నీలోనూ వైరాగ్యం పుట్టుకొస్తూంది? కొంపతీసి హఠాత్తుగా మమ్మల్ని అందర్నీ విసర్జించి బౌద్ధమతంలో కలవవుగదా?

నా :- ఏమో? ఎవరు చెప్పగలరు? కాలగర్భంలో ఏమి దాగి వుందోరా? అరేయి, సరేగాని, నువ్వు మన భారత వర్షంలో అన్ని ప్రదేశాలు దర్శించావుగదా? ఎక్కడరా, వుత్తమోత్తమమైన ప్రభాతసౌదర్యం, సాయంత్ర సౌదర్యం, వున్నది?

మిత్ర :- (ఆలోచించి) పునీతవారణాశిలో పవిత్ర గంగా నదీమతల్లి తీరాన సూర్యోదయ దృశ్యం అద్వితీయంరా. మనవూళ్ళో సాయంకాల దృశ్యం అద్భుతంరా!

నా :- ఇక్కడ సాయంకాల దృశ్యం చూచాను. యీసారి యేదోవంక పెట్టుకొని వారణాశి వెళ్ళి పునీత ప్రభాత దృశ్యం చూచి తీరుతారా.

మిత్ర :- ఒరే దేభ్యం! అసలు మనం కలుసుకోవాలి అనుకొన్నది మనం వేసిన ఎత్తులు ఎంతవరకూ పారాయి అనిగదరా. ఆ విషయంచర్చిద్దాం.

నా :- అవునురా కొత్తెం. మా వైశ్య యువకులలో నేను

ప్రభ అశ్వఘోషుల కలయికకు అనుకూలంగా బాగా ప్రచారం చేశాను. మా వైశ్యుల ప్రతిగృహంలో పెద్ద వాళ్ళ చిన్నవాళ్ళ మధ్య యీ విషయంలో సంఘర్షణ జరుగుతూంది.

మిత్ర :- బాగుంది. నువ్వు గట్టిపిండంవిరా. వైశ్యకులంలో పుట్టినా.

నా :- ఒరే మిత్రా! మాటిమాటికీ వైశ్యకులం వైశ్యకులం అని చెప్పుతున్నావు ఏం మేమంత తీసికట్టా ?

మిత్ర :- అవుననే నా నమ్మకం. ఎందుకంటే శ్రీమన్నారాయణుడు ఇంతవరకూ అన్నికులాల్లో అవతరించాడు. కాని, మీ వైశ్యకులంలో పేద్ద బండి సున్నా.

నా :- ఒరేయి! నీమాటలు వింటూంటే నాఒళ్ళు మండుతూంది.

మిత్ర :- పోయి ఒక కడివెడు నీళ్ళు తీసుకురానా ?

నా :- కట్టిబెట్టవోయి పరిహాసం. నేను చాలా గంభీరంగా మాట్లాడుతున్నాను. నా లో అంతర్భూతమైయున్న ఏదో మహాశక్తి నా చే త యిల్లాపలికిస్తూంది. విను, శ్రీమన్నారాయణుడు ఒక్క వైశ్యకులంలోతప్ప తతిమ్మా కులాల్లో అవతరించి వుండడంనిజమే. కాని ముందు ఒక నాడు మన భారతవర్షానికి అవసరం వచ్చినప్పుడు మా వైశ్యకులంలోనే దేవుడు అవతరించి - ఆనాడు మనం

అధఃపతిత అవస్థలో చిక్కుకొనివున్నప్పుడు - మా కులం లోనే యీశ్వరుడు అవతరిస్తాడు. ఘనకార్యాలు చేస్తాడు. అప్పటికి పూర్వఔన్నత్యాన్ని కోల్పోయి పిరికిపందలుగా మారిన మనజాతి జనులను ధీరులుగా మారుస్తాడు. ఆరోజు వచ్చితీరుతుంది. ఆ యుగానికి ఆవైశ్యునిపేరు గూడాపెడతారు. * ఆయనపేర నూతనశకం ఆరంభం అవుతుంది.

మిత్ర :- అలాజరుగుతే వైశ్యకులంలో అవతరించకుండా వున్నలోటును భర్తీచేసి దేవునికి పక్షపాతం లేదుఅని నిరూపించుకుంటాడు దేవుడు. అరేయ్, అసలు విషయం మర్చిపోతున్నాం. నేను చేసినదికూడా వినుమరి.

నా :- సావధానచిత్తుండనై తమవాగమృతధార గ్రోలడానికి బహు కుతూహలాయత్తచిత్తుండనై వుంటిని దేవా.

మిత్ర :- అయితే వినుము శిష్యపరమాణువా. తతిమ్మా కులాల్లో యువతీయువకబృందంలో - మనప్రభ అశ్వ ఘోషుల వివాహానికి అనుకూలంగా నేనూ ప్రచారం చేశాను. యివాళ ప్రతియింటా వృద్ధుల, యువకులమధ్య ఒకటే కురుక్షేత్రయుద్ధం సాగుతూవుంది.

నా :- కాని ఒక భయంగాఉందిరా! చివరికి గెలుపు ఎవరిదో?

మిత్ర :- గెలుపు ఓటములు, దైవాధీనములు. మనమల్లా

---

* మాతాతగారు కీ. శే. వింజమూరి భావనాచార్యులుగారు గాంధీశకంఅని తయారుచేశారు. కొన్ని పంచాగాలలో ఉదాహరిస్తున్నారు.

చేయగలిగింది ప్రయత్నం మాత్రమే.ఆపైని ఈశ్వరేచ్ఛ.

నా :- విన్నావురా? సువర్ణాక్షునికి కోపంవచ్చి ఇల్లువెడలి బయటికి పోయినారట.

మిత్ర :- ఆయన మనవూళ్ళోవున్న సత్రంలో బసపెట్టారుట. ఎన్నాళ్ళురా ఆయన తనభార్యాపుత్రులను వదలి వుండగలిగేది? ఇవ్వాళో రేపో తిరిగి యిల్లు చేరుకుంటారు. బ్రాహ్మణులకు కోపం ఇట్టే వస్తుంది, అట్టే పోతుందిరా.

నా :- ఏమోరా నాకు చాలా భయంగా వుంది. ఒక పెద్ద జంఝామారుతం కుర్రవాళ్లం లేవదీసేశాం. ఏమవుతుందో?

మిత్ర :- భయంలేదు, గియంలేదు. గాలిని చిలికేం. సుడిగాలివస్తే అదీ భరించాలి.

నా :- చీకటి పడుతోంది. ఇవ్వాళ విదియకదూ? మా అయ్య యింతసేపూ కొట్టు వదలిపెట్టి ఎక్కడికి వేంచాశావురా వెధవా అని నన్ను చివాట్లుపెడతాడు. ఇంక వెళ్తారా.

మిత్ర :- సరేరా. నేనట్లా సరయూనదీతీరానికి వెళ్ళి, ఏకాంతంగా కూర్చుని నా యిష్టమంత్రాన్ని జపించుకుంటా. మళ్ళీ కలుద్దాంరా.

(ఇద్దరూ నిష్క్రమిస్తారు. తరువాత ఆ ప్రదేశానికి ప్రభవస్తుంది. చీని చీనాంబరంధరించింది. నీలపురంగు చీర, మల్లెపూవులు తలలో,

మల్లెదండ మెడలో. అప్పటికి చంద్రోదయము అయింది. ఒక పాట పాడుతోంది.)

రేయీ
హాయీ రేయీ,
కడు హాయీ రేయి,
చూడు చెలీ, కడు హాయీ రేయి॥ రేయీ॥

అందాల మూట యీ రేయి,
చందాల బాట యీ రేయి,
పున్నమి రేయి, వెన్నెల రేయి,
చూడు చెలీ, కడు హాయీ॥ యీ రేయి॥

వెన్నెల వెన్న చిలికే రేయి,
కన్నెకు వన్నె పూసే రేయి,
నవ్వుల మొలకలు,
ఒడల పులకలు,
విరబూసే రేయి,॥ చూడు చెలీ॥

యీ వెండి రేయిలో కాయును కలలు,
యీ వెండి రేయిలో పూయును పాటలు॥

(ఆపుతుంది. నాలిక కరచుకుంటుంది. స్వగతం) యిదేమిటి? రెండో చరణం మొదలుగా, మొదటిచరణం రెండోదిగా పాడేశానేమిటి? యిది బహుశా నా పరవశత్వంవల్ల దొర్లినతప్పు. (మళ్ళీ పాడుతుంది)

యీ వెండిరేయిలో పూయును పాటలు
యీ వెండిరేయిలో కాయును కలలు
మనుజుల మృగముల,
నదుల వనమ్ముల,
మైమరపించేరేయి ॥ చూడు చెలీ॥

తేనెలానెదము, చిన్నారి,
నెత్తావి జల్లెదము, పొన్నారి,
వెలుగుల కులుకుల,
కలకల కిలకిల,
కిచకిచలరేయి ॥చూడు చెలీ॥

కొమ్మకొమ్మలా, రెమ్మరెమ్మలా,
ఆహా కొమ్మకొమ్మలా, రెమ్మరెమ్మ
ల్లే జొంపపాన్పుల, పూలపాపల,
వూయలలూపి జోలలుపాడి,
జోజో, జోజో, జోకొట్టేరేయి ॥చూడు చెలీ॥

కాంతు మెన్నటికో, యిలాటిరేయి ?
కాంతుమో కానమో యిలాటిరేయి,
సాటిలేని మేటిరేయి, చూడు చెలీ,
అహా చూడు చెలీ, ఒహో చూడు చెలీ
కడుహాయీ రేయి॥

(చివరి చరణం పాడకమునుపు సువర్ణాక్షుడు ప్రవేశిస్తాడు. ప్రభ పాడుతున్నంతసేపు ఆమెపై పు తదేకదీక్షగా చూస్తూఉంటాడు. ఆపాట వింటూవుంటాడు.)

సుడు :— ప్రభా! అమ్మాయీ!

ప్రభ :— (ఉలిక్కిపడి తిరిగిచూచి, సర్దుకొని) పూజ్యులకు ప్రణామాలు. (అంటూ అతని చరణాలను వంగి స్పృశిస్తుంది.)

సుడు :— దీర్ఘసుమంగళీభవ (అని ఆశీర్వదిస్తాడు.)

ప్రభ :— కడుధన్యురాలినిస్వామీ.

సుడు :— అమ్మాయి, నీతో ఒక విషయం చర్చించుదామని నీవద్దకు వచ్చాను.

ప్రభ :— తమరి దర్శనభాగ్యం యిల్లాగైనా నాకు కలిగినందులకు కృతార్థురాలిని.

సుడు :— (తనలో) ఏమి నమ్రత! (ఆమెతో) చూడమ్మా!

ప్రభ :— సెలవీయండి.

సుడు :— నాకు ఒకగాని ఒక్కకొడుకు.

ప్రభ :— అతడు సుగుణాలకు ఆలవాలము.

సుడు :— అవును నిజమే. చూడు ప్రభా! నీమీద నాకేమీ ద్వేషం లేదు. నేను పూర్వకాలపువాణ్ణి; ఒక్కగాని ఒక్క కొడుకు. అతనిని నానుంచి నువ్వు వేరుచేసి లాక్కుంటే నా గతి ఏంకాను ?

ప్రభ :- అయ్యా! నేను అల్లాంటి అధర్మ కార్యం చేస్తానా ?

సుడు :- మరి ఇదేమిటి ? నిను దప్ప మరెవరినీ చేపట్టనంటాడు వాడు. నేనందుకు అంగీకరించలేను.

ప్రభ :- అయ్యా! అతనే నన్ను ప్రేమించాడు. నేనిది సమాజపు కట్టుబాట్లకు వ్యతిరేకమని ఎన్నోవిధాల నచ్చజెప్పాను. నన్ను ఆశింపవద్దని కాళ్ళా వేళ్ళా పడ్డాను. కాని అతను నన్ను వదలి ఉండలేనంటున్నాడు. నన్నేం చెయ్యమంటారండీ ?

సుడు :- అది నిజమేనని నాకు తెలుసునమ్మా, నాలో జీర్ణించుకొనివున్న పురాతన సంప్రదాయపు సంస్కృతులు నన్ను యీ పనికి ఒప్పుకోనీయవు. ఇందులో నేను నిస్సహాయుణ్ణి.

ప్రభ :- నాన్నగారూ, నేను మీయింటికి వచ్చినా మీయొక్కయు అత్తయ్యలయొక్కయు పాదదాసిగా మాత్రమే వుంటాను. మీతో కలసి సహాపంక్తి భోజనము చెయ్యను. మీరందరూ భోజనంచేసిన తరువాత వేరే నాకింత ప్రసాదం వడ్డిస్తే దానితోనే తృప్తిపడతా. చూడండి, నాతండ్రి ఆగర్భశ్రీమంతుడు, అయినా నేనందుకు వప్పుకొన్నానంటే నాకోసం గాదు, మీ అబ్బాయికోసమే.

సుడు :- ఎంత త్యాగ స్వరూపిణివమ్మా నీవు !

ప్రభ :- మా భోధిసత్వుడు త్యాగము ప్రధానమని వుపదేశించి వున్నాడు.

సుదు :- చూడమ్మా, నేను సకల భారతవర్ష పండిత ప్రకాండులలో మేరు సమానుడను. ఇంతవరకూ నా జీవితంలో దేనికోసమూ ఏ మానవుణ్ణి ప్రాధేయపడలేదు. అల్లాంటి నేను మా అబ్బాయిని వదిలిపెట్టమని నిన్ను ప్రాధేయ పడుతున్నాను. నామాట వినవూ ?

ప్రభ :- యిలాంటి పరిస్థితిలో మిమ్మును తెచ్చినందులకు నాకెంతో సిగ్గుగానున్నది. పెద్దలపట్ల నేను అపచారం గావించాను. నన్ను క్షమించండి.

సుదు :- దానికేమిటిలే అమ్మాయి. నామాట కేమంటావు ?

ప్రభ :- నా స్థితి అడకత్తెరలోని పోకచెక్క అయింది. అటుచూస్తే నుయ్యి, యిటుచూస్తే గొయ్యి. కర్తవ్యం నాకు గోచరించడంలేదు.

సుదు :- (చాలా ప్రయత్నపూర్వకముగా హఠాత్తుగా తన తలపాగా తీసి ఆమె పాదాలవద్దనుంచి) అమ్మాయి, దేవతలను సహితం చేయిజాచి వరమడుగని నేను నీనుంచి, ఒక వరం కోరుతున్నాను. నీ ప్రేమ బంధంనుంచి ఎల్లాగో అల్లా ఏదో వుపాయంచేసి మా అబ్బాయిని విముక్తుని చేయుమని నిన్ను బ్రతిమాలుకొంటున్నాను. నాకు పుత్రభిక్ష పెట్టవా అమ్మాయీ ?

ప్రభ :- (తటపటాయిస్తుంది-కళ్ళనీళ్ళు చెమ్మగిల్లుతవి. లోపలినుంచి

వస్తూవున్న పుత్రికొన్ని అణచుకుంటుంది.) నాన్నగారూ, మీలాంటి శాస్త్రనిష్ణాతులు, పవిత్ర జన్ములు నన్ను అర్థిస్తూవుంటే నేను కాదని ఎల్లా అనగలను ?

సుదు :- వృత్తమురాలివమ్మా, నీ వంశానికి నువ్వు గొప్ప కీర్తి నిస్తావమ్మా. నేనింక గట్టు ఎక్కినట్లే.

ప్రభ :- నాన్నగారూ, ఈ విషయమై మీ అబ్బాయితో సంప్రదిస్తాను అనిమీకు బుద్ధదేవుని సాక్షిగా వాగ్దానం చేస్తున్నాను. (అని చెప్పుతూ తలపాగ తీసి అభినయపూర్వకంగా సువర్ణాక్షుడికి అందిస్తుంది. అతడు తిరిగి ధరిస్తాడు తృప్తితో)

సుదు :- నువ్వు సార్థక నామధేయవు. అమ్మాయీ! నన్ను కటికచీకటిలోనుండి వెలుగులోకి మళ్ళీ తీసుకొని వచ్చావు. నువ్వు సౌభాగ్యవతివై పుట్టినింటికీ, మెట్టినింటికీ ఖ్యాతి చేకూర్చుదువు గాత !

ప్రభ :- (చేతుల మోడ్చి) మహాప్రసాదం, మహాప్రసాదం. మీ ప్రసాదం శిరోధార్యం.

సుదు :- ఇంక వెళ్ళివస్తానమ్మా. ఇవ్వాళ సాయంకాలం సంధ్యావందనం మామూలు వేళకు వార్చుకోలేక పోయాను - కాని, వెళ్ళివస్తానమ్మాయీ - (అని మళ్ళీ అని, పోబోతూవుంటాడు.)

ప్రభ :- నాన్నగారూ నాది ఒక మనవి. మీమాట నేను కొంతవరకూ విన్నాను. మీరుకూడా నా మనవి ఆల కించి తిరిగి మీయింటికి వెళ్ళిపోరూ ?

సుమ :- సరేనమ్మాయి, యిప్పుడే మాయింటికివెళ్ళిఅక్కడే సంధ్యావందనము వార్చుకుంటాను.

ప్రభ :- నేను నేనెంతో ధన్యురాలను, నానోము పండింది. విడిపోయిన పితాపుత్రుల తిరిగి కలిపాను. ధన్యోస్మి! ధన్యోస్మి!

(సువర్ణాక్షుడు సంతోషంతో వెళ్ళిపోతాడు. నేపథ్యంలో తత్వాలలో ఇందుకు అనుగుణ్యమైన ఒక పాట పాడబడాలి.)

(తెర పడును; తిరిగి ఎత్తబడును.)



## ఆరవ దృశ్యం

(అదే స్థలం. సంతోషంతో ఉన్నదల్లా ప్రభ అకస్మాత్తుగా వెల వెల పోతుంది. కళ్ళనిండా నీళ్ళు నింపుకుంటాయి.)

ప్రభ :- (స్వగతం) అయ్యో! నేనేంచేశాను? మాటయిచ్చే నేనే. ఇచ్చినమాటను మన్నింపకతప్పదే. అయ్యో! ఇల్లా చేశానేమి బుద్ధదేవుడా? నేనిల్లాచేశానేం? ఇకముందు నాపై బడ్డ బాధ్యతను నిర్వహించడం ఎల్లాగ ఓబుద్ధ భగవానుడా? (చేతులతో కళ్లుమూసుకొని కాసేపు వెక్కి వెక్కి ఏడుస్తుంది. మళ్ళీ కళ్ళు తుడుచుకుంటుంది.) ఓ బుద్ధ భగవానుడా! ఇచ్చినవాగ్దానమును నిలబెట్టుకొని తీరాలి. అందులోనే జీవితపు సార్థకత వున్నది. (నిశ్చలంగా) ఓ బుద్ధభగవానుడా! నాకు శక్తినిమ్ము. మనోధైర్యము ప్రసాదింపుము దేవా. (చంద్రునివైపుచూచి) అతను వచ్చే వేళ అయినది. నేనింక గుండెనిబ్బరంతో క్రొత్తపాత్రను నిర్వహించాలి; నిర్వహిస్తానుకూడా. (నేపథ్యంలోనుంచి

సమష్టిగా 'బుద్ధం శరణం గచ్ఛామి, సంఘంశరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి' అనేమాటలు వినబడుతవి.)

ఆ౹ అది. నేనొకవ్యక్తినిమాత్రమే. నాకొక్కత్తెకు నష్టం. అపారనష్టమే కావచ్చు, కలుగుతుంది. కాని యీ నష్టాన్ని లోకకళ్యాణానికే వినియోగిస్తాను. ఓమనసా! ఇన్నాళ్ళూ రంగస్థలంమీద వివిధ భూమికలు అభిన

యించావు. ఇక జీవితంలో క్రొత్తభూమిక చాకచక్యంతో వివేకంతో, కార్యసిద్ధి అయ్యేలాగ అభినయించాలి సుమా. (నేపథ్యంలోనుంచి పాంకోళ్ళధ్వని వినపడుతుంది.) ఆఁ అడుగో! వచ్చేస్తున్నాడతను (అశ్వఘోషుడు ప్రవేశిస్తాడు. వస్తూనే)

అ :– ప్రభా! ఓ ప్రభా! క్షమించు, ఆలస్యం అయింది.

ప్రభ :– యేం? ఎందుకు ఆలస్యమైంది?

అ :– పడమటివాడలో కవితాగోష్ఠి ఒకటి జరిగింది. నన్ను ఒకపాట పాడి పోవలసినదని కవులు కోరేరు. అందువల్ల అయింది ఆలస్యము.

ప్రభ :– నువ్వుపాడిన గేయమేమిటి? నాకు వినిపించవూ?

అ :– నీకు వినిపించక మరిఎవరికి వినిపిస్తాను? విను ప్రభా!

చందమామా!
ఓ చందమామా!
ఏలనోలాగేవు,
తెల్లతీవెలతోను? ॥చందమామా॥

నీ బసా ఆసీమ,
నా బసా యీసీమ,
నామనసులోని మాట,
నీకు సెపితే లాభం?

తీయనైన మాటేమో, చందమామా!
రాయేమో నీగుండె చందమామా! ||చందమామ||

పలుక నాలుక లేదు,
కాంచ కన్నులు కలవు
వలపు ముచ్చటలెన్నో,
వినగ వీనులు గలవ?
ఎందరెందరిగుట్టో, చందమామా,
పదిలపరిచావులే చందమామా ||చందమామ||

వెలుగుతూ కులికేవు,
కులుకుతూ తిరిగేవు,
ఉన్న మాటందునా?
వులికేవా? అలిగేవో?
అందమంతా నీదా చందమామా?
అరువుసొమ్మేగదా చందమామా!! ||చందమామ||

(నాది)
ఆరిపోనిఆశ,
అంతులేనీ మమత,
చేతికందగరాని,
చూపుదాటిపోని,
రత్నాలవాలోయి చందమామా,

(నాకు)
అనురక్తి కావాలోయి చందమామా॥చందమామ॥

ప్రభ :- ఒకసారి చివరిచరణం మళ్ళీపాడవు ?

అ :- (పాడుతాడు)

ప్రభ :- ఎంత వెర్రివాడవునువ్వు? చేతికందకూడదా! అయినా చూపుదాటిపోకూడదా! చేతికందకుండా నీ చూపు దాటిపోతే ?

అ :- అమ్మో !

ప్రభ :- ఏం ?

అ :- అమ్మో ! చేతికందకపోతే పర్వాలేదు, కాని చూపు దాటిపోతేనాకు చేటురాదూ ?

ప్రభ :- ఓయి వెర్రివాడా ! ప్రేయసీ ప్రియుల హృదయాలు ఐక్యమైపోయినతరువాత ఒకరు భౌతికంగా వేరుపడినా రెండవవారు భరించాలి. గడచిన సుఖదస్మృతులుచాలు, తతిమ్మా జీవితం గడపడానికి.

అ :- ప్రభా! యివ్వాళనువ్వు వేదాంతం మాట్లాడుతున్నావేం ? నేనింకా ఆపై మెట్టుదాకా చేరుకోలేదు లే.

ప్రభ :- ఏనాటికైనా చేరుకోకతప్పదు. వాటికేంగాని, నేనూ ఒకపాట వ్రాశాను; ఇదినా ప్రథమరచన......

అ :- నువ్వూ కవిత్వంవ్రాశావా ప్రభా ?

ప్రభ :- ఇన్నాళ్ళు ఒకమహాకవి సతతసాన్నిహిత్యం పొంది కూడా కవిత్వం అబ్బకుండా వుండడం సంభవమా?

అ :- సరే, చదువు; వింటాను నీ మొదటి కవిత్వం.

ప్రభ :- విను.

* అ - అనగా అనగా- 'అనురాగం'-
మన పెదవుల - పూర్ణానుస్వారం!
ఆ - ఆదిగ - 'ఆకారం'-
ప్రేమావేశముకొల్పును-నీరూపం!
ఇ - అ - ఆ - ఇ - 'ఇచ్ఛా'-
అంజలి నర్పించెద - నాస్వేచ్ఛ!
ఈ - ఈజగతికి ఆధారం - 'ఈశ్వర్'-
నీవెకావా - నాహృదయేశ్వర్!
ఉ - ఉచ్చరించుము - 'ఉపయోగం'
లచ్చువరాలైనవద్దు-యీప్రేమవియోగం!
ఊ - అ - ఆ - ఇ - ఈ - ఉ - ఊ - 'ఊర్వశి'
ప్రియతమా!-తాళజాలదింక- నీ ప్రేయసీ!

అ :- ప్రభా! చిత్రకవిత్వం వ్రాసేవు. ఎంత శ్రావ్యమైన గొంతుక! (ఆమెను ఆపాదమస్తకంచూస్తూ) ఎంతకోమలమైన శరీరం! మీనుల్లాంటి నీకళ్ళనుండి ఎందుకో వేడిచూపులు నామదిలో చిచ్చుపెట్టి వెర్రిఆశలన్నీ రేకెత్తిస్తూవున్నాయి.

* ('ఆతడు-ఆమె' నవలనుంచి)

యికనుండి యీ ఊర్వశిదగ్గర పాఠాలు నేర్చుకోవాలని ఉన్నది.

ప్రభ :- ప్రియతమా! యీ శరీరం అశాశ్వతం. మీ వేదాంతం ప్రకారము ఆత్మ శాశ్వతం; ఆత్మ అనాది, అది అనంతం, నిత్యం. క్షణభంగురమైన యీ తనువుమీద యింతమక్కువ వుండకూడదుఘోషూ.

అ :- వేదాంతం నాకు తెలుసును - సిద్ధాంతం మాత్రమే, కానీ ఆచరణలో పెట్టలేను ప్రభా! (కాసేపు ఆగి) కొన్నాళ్ళనుంచి ఎందుకో నాలో ఏదో గొప్ప మార్పు జరుగుతోంది. మా వైదీకి బ్రాహ్మణ మతం అంటే నాకు ఏవగింపు కలుగుతోంది. మీ బుద్ధమత అనుయాయులను దగ్గరగా దగ్గరగా - నీ పుణ్యంవల్ల - చాలా రోజులనుంచి గమనిస్తూవున్నాను. ఈ కాలానికి బుద్ధ మతం ఒక్కటే విశ్వానికి శరణ్యం అని అనిపిస్తూవుంది.

ప్రభ :- అల్లా నీలో మార్పు రావటం నాకు సమ్మతమే. కాని యీ ప్రభ నిన్ను చెడగొట్టిందని లోకం కోడై కూస్తుందేమో.

అ :- ఇంకా నేను ఒక నిర్ణయానికిరాలేదు ప్రభా.

ప్రభ :- (నిట్టూర్పుతో) అమ్మయ్య! బ్రతికించావు.

అ :- ఇందాక ఏదో వేదాంతం మాట్లాడేవే ప్రభా. నీ భౌతిక సౌందర్యమే నేను ఊర్వశీవియోగ నాటకాన్ని

రచించడానికి ప్రేరణ యిచ్చింది. నీ లావణ్యం, ప్రభా! నా కావ్యాన్ని హృదయంగమంగా చేస్తూవుంది.

ప్రభ :- ఆగు. కవిత్వం హృదాయాన్నుంచి కాదూ వుద్భవించడం ?

అ :- కొంతవరకే. కవిత్వం హృదయాన్నుంచే కాకుండా బాహ్యపరిస్థితులను బట్టి కూడా ఉద్భవిస్తుంది. ప్రభా! నువ్వే నాకు ప్రేమ సత్యాన్ని ప్రబోధించావు. నువ్వే నాకు గురువ్వి.

ప్రభ :- ఆలోచిస్తే నీవు చెప్పేది సమంజసంగానే వుంది. వాస్తవిక సౌందర్యం ప్రోత్సహించకపోతే కవిత్వం పరిణతికి రాదేమో! నేను నీ విగ్రహాన్ని మానంతో వూహించడానికి ప్రయత్నిస్తున్నాను. కవిత్వ పరిభాషలో చెప్పాలంటే, నేను చిత్రించాలని ఆశిస్తున్నాను. కాని దౌర్భాగ్య వశాన కవిత్వం నా సహజధర్మంగాదు. ఆ రోజున నీకు ఒకసారి చెప్పాను, జాపకం వుందా ?

అ :- ఏరోజున ఏమిచెప్పేవో; ఏన్నో చెబుతూ వచ్చావు. నువ్వు అనుకొన్నది నాకు జ్ఞాపకంలేదు.

ప్రభ :- అయితే మళ్ళీ చెపుతా విను. శ్రద్ధగా విను. నన్ను నీగురువా అన్నావుగా ఇందాక ?

అ :- నువ్వు గురువేను. నేను కాస్సేపు నీ శిష్యుణ్ణిగా వుంటాను.

ప్రభ :- అయితే సావధానచిత్తుండవై వినుము శిష్యా. నిన్ను నువ్వు ఇద్దరు వ్యక్తులవలె భావించుకోవాలి. తెలిసిందా ? నా దృష్టిలో నువ్వు అమరజీవివి. ఈ యుగంలో కల్లా గొప్ప కవి అయిన అశ్వఘోషుడవు మాత్రమే అని నువ్వు మొదట భావించాలి. ఎందుకంటే అశ్వఘోషుడు ఏ ఒక్క వ్యక్తి సొత్తూ కాడు; అతడు సకల విశ్వపు అమూల్యరత్నం; అతడు అందరి సొత్తు.

అ: – (నిట్టూర్పు విడుస్తూ) జ్ఞాపకం వచ్చింది ప్రభా.

ప్రభ :- చూడు, ఆనాడు బుద్ధవిహారానికి మనం వెళ్ళినప్పుడు కాల్‌కారామ్ భిక్షువును దర్శించాము. అతడు అన్న మాటలు నీకు జ్ఞాపకంవున్నాయా ?

అ :- అవును, అవును. అతడు గొప్ప మేధావి.

ప్రభ :- అతడు చాలా దేశాలు భ్రమణం చేశాడు.

అ :- అతడు పుట్టింది ఎక్కడ ?

ప్రభ :- ఈజిప్టులో.

అ :- అవునుకాని, ప్రభా ఒకటి నాకు యింతవరకూ అర్థం కావడంలేదు. మనదేశానికి – వచ్చిన గ్రీసు దేశీయు లందరికి బౌద్ధమతము అంటే అంత గౌరవ ప్రపత్తులు ఎందుకు కలిగాయి ?

ప్రభ :- చెప్తా. అది వారి స్వభావాలకు, వారి స్వతంత్రభావాలకు అనుగుణ్యంగా వుంది గాబట్టి.

ప్రభ

అ :- అంతా బాగుంది, కాని బౌద్ధమతం ప్రతివాణ్ణి సన్యాసిగానో తాపసిగానో భిక్షువుగానో చేయడానికి ప్రయత్నిస్తుంది. అది ఒక్కటే చిక్కు.

ప్రభ :- ఆ చిక్కునే విడదీస్తా. నువ్వింకా బాగా గమనించలేదు. అల్లా అన్నందుకు క్షమించు. బౌద్ధులలో సన్యాసులు వున్నారు; సంసారులు వున్నారు. సంసారులతో పోల్చిచూస్తే, బౌద్ధసన్యాసుల సంఖ్య తక్కువ. అందరి వలెనే బౌద్ధ గృహస్థులు అన్నీ అనుభవిస్తారు.

అ :- తెలిసింది. మన దేశంలో అనేక మతాలు వున్నాయి గదా! బౌద్ధమతాన్నే గ్రీకులు ఎందుకు అవలంబించారు ?

ప్రభ :- బౌద్ధమతం యిప్పుడున్న అన్ని మతాలకంటె వుదాత్తమైనది, వుదారమైనది గనుక. మీ హిందువులు గ్రీకు సైన్యాధిపతులను- సైనికులను మాత్రమే - కాదు ఇక్కడకు వలసవచ్చి స్థిరబడిపోయిన గ్రీకువర్తకులను గూడా నీచంగా, ఏహ్యంగా చూస్తూవచ్చారు. కాని బౌద్ధులు వీరందరిని సమానంగా చూచారు; దగ్గరకు చేర్చుకొన్నారు. అదీ ఒక కారణం, మా గ్రీకులు బౌద్ధ మతావలంబులు కావడానికి.

అ :- అవును ప్రభా, నువ్వు చెప్పినదాంట్లో సత్యంవుంది. ప్రభా! మనం ఆనాడు విహారంలో కలుసుకొన్న ఆ ధర్మరక్షిత్ మతం ఎక్కడ పుచ్చుకొన్నాడు ?

ప్రభ :- అలెగ్జాండిరియా లోనే, బౌద్ధవిహారంలో మతం పుచ్చుకొన్నాడు.

అ :- ప్రభా! ఆ మహానుభావుణ్ణి మరొక్కసారి దర్శనం చేసుకోవాలనివుంది, నీతో బాటు.

ప్రభ :- తప్పకుండా దర్శనం చేసుకొందాము,నీకున్న సందేహాలన్నిటినీ అతడు తీర్చగలడు. గ్రీకు వేదాంతం ఆసాంతం క్షుణ్ణంగా చదివాడుకూడా.

అ :- అవన్నీ అతని పాదాలవద్దకూర్చొని నాకు నేర్చుకోవాలనివుంది.

ప్రభ :- నేర్చుకో. కాని, ఆయన మాటలన్నీ విని విరక్తుడవై నన్ను మరచిపోకుసుమా.

అ :- నిన్నా! నేనా! మరువడమా! అసంభవంప్రభా.

ప్రభ :- ఎట్టిపరిస్థితులలోనూ నన్నుమాత్రము విసర్జించి విహారంలోకి పోవద్దు; ఏం ?

అ :- పిచ్చిప్రభా! నిన్ను మరువలేను నిన్నువిడువలేను, అని ఎన్నిసార్లు చెప్పను. కాని ఆ విహారంలో ఎక్కువతక్కువలు, మాలోవున్న పాటకులభేదాలు మచ్చుకైనా లేవు. ప్రభా! నాతో బాటు ఒకదివ్యమైన, ఒకభవ్యమైన, ఒకరమ్యమైన స్వప్నంవూహిస్తావు? గ్రీకు దేశీయులతో బాటు-సన్యాసులు, సంసారులు-కులీనబ్రాహ్మణులు మొదలు, చండాలురవరకూ- అందరూ ఒకేచోట నివసిస్తూ కలిసిమెలిసి భోజనపానీయ

ములుచేస్తూ, విద్యార్జన చేస్తూవుండడం,- ఆ దివ్యస్వప్నం ఒకసారి ఊహించుకో ప్రభా.

ప్రభ :- ఆహా! ఆ సుదినం ఎప్పుడువస్తుందో! అవునుగాని ప్రియుడా!

అ :- ప్రియుడేమిటి? నేను శిష్యుణ్ణి; నువ్వు నాకు గురువువు.

ప్రభ :- ఫో. ఎప్పుడూ ఒక టేపాత్రా? ఇప్పుడు నేను నీ ప్రేయసిని.

అ :- నేను నీ ప్రియుడను.

ప్రభ :- (కొస్తదగ్గి) నీకో విషయం చెప్పాలి. నువ్వు రాక మునుపు మీనాన్నగారు ఇక్కడకువచ్చారు.

అ :- వచ్చారా? ఇక్కడికా? నాన్నగారా?

ప్రభ :- నాతో చాలామాట్లాడేరు. అన్నివివరాలు ఎందుకులే. (వయ్యారంగా ఒళ్లు విరుచుకుంటుంది.) చివరికి తన తలపాగాను నాపాదాలవద్దఉంచి, నాప్రేమ బంధనం నుంచి తన ఏకైక పుత్రుణ్ణి విముక్తుని చేయుమని నన్ను ప్రాధేయపడ్డారు.

అ :- (ఆతురతతో) ఏమన్నావు నువ్వు?

ప్రభ :- నీతో యీ విషయము బాగా చర్చిస్తాననీ, నీతో సంప్రదిస్తాననీ వాగ్దానంచేశాను.

అ :- (నవ్వి) చాలా భయపడ్డాను. అంతేగదా. నువ్వు విముక్తియిచ్చినా తన తనయుడు తనవద్దకు వచ్చినట్లు

అవుతుందా. (ఆగి) మంచిది. ప్రభా, ఆగొడవఎందుకులే. ఇందాక తెగిపోయిన సూత్రాన్ని మళ్ళీ కలుపుకొందాం. చూడు ప్రభా! మా బ్రాహ్మణులంటే నాకు పరమ అసహ్యం.

ప్రభ :- (నవ్వి) నువ్వూ బ్రాహ్మణుడవేగా ?

అ :- (నిటూర్పు) దౌర్భాగ్యవశాన అవును. అప్పుడప్పుడు అందుకు నాకు సిగ్గువేస్తుంది.

ప్రభ :- ఏం ? సిగ్గెందుకు ?

అ :- వాళ్ల పేరు చెబుతేనే నాకు ఒళ్లు భగ్గుమంటుంది.

ప్రభ :- ఒక కడివెడు నీళ్లు ఆ సరయూ నదినుంచి తీసుకొని రానా ? మంట తగ్గుతుందేమో.

అ :- పరిహాసాలకు ఇది వేళగాదు ప్రభా. నామాట్ల కడ్డు రాకు. నా భావాన్ని పూర్తిగావ్యక్తం చెయ్యనీ, నిన్న టితో నాబ్రాహ్మణత్వాన్ని వదలుకున్నాను. అందుకు నిదర్శనంగా నా జందెంకూడా తీసి పారేశాను. ఇంకనాలో అభిమానంలేదు; ఇకముందు వుండదు. ఇప్పుడు నేను ఒక మానవుణ్ణి మాత్రమే.

ప్రభ :- అంతవరకూ వచ్చిందీ? మీ సంఘం నిన్ను వెలివేస్తేనో ?

అ :- నా అంతరాత్మయే నాకు ప్రమాణం, ప్రభా. ప్రపంచంలోవున్న అందరూ కట్టకట్టుకొని శస్త్ర అస్త్రాలతో నా

ఎదుటపడి 'మీ భావాల్ని మార్చుకోవాలి' అని బెది రించినా నేను జంకనూ గొంకను. ఎందుకంటే, నేను నమ్ముతున్నది సత్యం కాబట్టి, ధర్మం గాబట్టి, న్యాయం గాబట్టి.

ప్రభ :— చాలా వుద్రేకం చెందుతున్నావే యివ్వాళ?

అ :— ఇవ్వాళే పూర్తిగా చెప్పివేస్తా, నీతో. శ్రుతి స్మృతి, పురాణ ఇతిహాసాలు వాళ్లు తమ ప్రమాణ గ్రంథాలంటారు. నేను అవన్నీ సాంగోపాంగంగా చదివేను; మననం చేశాను; బాగా ఆలోచించాను. కాని, వాళ్లు దేనిని నమ్ముతున్నామని చెబుతున్నారో, అదినాకు ఆ గ్రంథాలలో ఆవగింజంతైనా కనుపించడంలేదు. బహుశా వాళ్లు స్వార్థాన్ని వుపాసిస్తున్నారనుకుంటా. ఈ నాటి బ్రాహ్మణులకు కావలసినదల్లా కుత్తుక నిండా మస్తుగా భోజనం; ధన ధాన్య కనకవస్తు వాహనాలు, అంతే. వీటికోసం అయోగ్యులైన రాజుల్ని, అధర్మ మార్గాలద్వారా విత్తం సంపాదించే ధనికుల్ని, తెగపొగుడ్తారు.

ప్రభ :— ఆ మతంలో అధిక సంఖ్యాకులైన తక్కువకులస్థులకు— ముఖ్యంగా — బీదలకు తావే లేదు.

అ :— అవును. మొదట మీ దేశీయుల్ని దగ్గరకు చేరనీయక పోయినా, తదనంతరము దక్షిణలు పొందవచ్చునని దండ యాత్రచేసిన గ్రీకులను శాక్యులను క్షత్రియులుగా గుర్తించేరు. కాని వాళ్లతోబాటు వచ్చిన తక్కువ తరగతి

బానిసలను కష్టజీవులను నీచంగా చూస్తూ వచ్చారు. దీంట్లో కనబడడంలేదూ వాళ్ల స్వార్థపరత్వం? (బిగ్గరగా) ఏమతంలో అయితే ఔదార్యంలేదో, ఏమతంలోఅయితే సర్వమానవ సమత్వం లేదో, ఏమతంలో అయితే సౌభ్రాతృత్వంలేదో, ఏమతంలో అయితే ధనం, అధికారము ప్రాధాన్యత వహిస్తాయో, ఆమతం ఎంత ప్రాచీనమైనదైనా, సమస్త మానవజాతికి ఒక కళంకం; ఒక మాయనిమచ్చ. (మెల్లగా) ప్రభా! నువ్వునాకు చేదోడు వాదోడుగావుంటే, యీ పాప భూయిష్ఠ ప్రపంచాన్ని మారుస్తా: గొప్పవిప్లవం లేవదీస్తా, శాంతి అహింస సత్య ధర్మ పునాదులమీదనే.

ప్రభ :- మరి మీ వేదాలో ?

అ :- నాలుగు వేదాలూ ఆమూలాగ్రంగా, విమర్శనాత్మకంగా పరిశీలించాను. అవి చదువుతే నాకు గోచరించింది, ఎప్పటి కప్పుడు సమాజంలో మార్పులు జరుగుతూనే వున్నాయి అని. కాని, యీ నాటి బ్రాహ్మణులలో తుప్పు పట్టిన ఆచారాలూ అలవాట్లు కూడు కట్టుకొన్నవి. అవి శాశ్వతాలనీ, దేశకాలానుగుణ్యంగా మార్పులు జరగడానికి బొత్తిగా వీలులేదనీ, మొండిగా వాదిస్తున్నారు.

ప్రభ :- నేనూ ఒక ఆచార్యునివద్ద మీ వేదాలు చదివాను. నేనూను వ్యాఖ్యిన నిర్ణయాలకే వచ్చాను. నా కిన్నాళ్లు భయమేమిటి అంటే, నీలోని యీ తీవ్ర విప్లవ భావాలకు నేనే కారణం కాదుగదాఅని.

అ :- అయితే ఏం ప్రభా! నువ్వే కారణం, నువ్వే ప్రధాన కారణం అనుకోందాం. అందుకు నీకు సదా కృతజ్ఞుణ్ణి. నీ వల్లనే సకల జ్ఞానాన్ని బ్రాహ్మణులు ఒక్కరే గుత్తకు తీసుకోలేదని గ్రహించాను.

ప్రభ :- ఎంతైనా నేనొక ఆడుదాన్నేగా, స్త్రీనేగా.

అ :- ప్రభా! ఎవడైనా స్త్రీని స్త్రీఅనే కారణంచేత నీచంగాచూస్తే, అతడు పరమ అధమాధముడుఅని నేను అంటాను. ప్రభా, మనం తర్కిస్తున్న సూత్రం మళ్ళీ తెగింది. దాన్ని తిరిగి ముడివేస్తాను. గ్రీకులెవరూ ఈ బ్రాహ్మణమతాన్ని అనుసరించనందులకు నాకెంతో సంతోషంగావుంది.

ప్రభ :- మేము బౌద్ధులమైనా బ్రాహ్మణులు మాయిళ్ళకు వస్తూనేవుంటారుగా.

అ :- స్వలాభాలకోసం, దానదక్షిణలకోసం! (అంటూ అకస్మాత్తుగా ఆకాశంవైపు చూస్తాడు. చంద్రుణ్ణి, తారల్ని చూస్తూ పరధ్యాన్నంలో వుంటాడు. ప్రభ గమనిస్తుంది.)

ప్రభ :- (మెల్లగా) ఘోష్! ఇంతలో వున్నట్లుండి నీమనస్సు ఎటో పోయినట్టుందే?

అ :- (తెప్పరిల్లి) ఆఁ ఆఁ అవును, అవును. యీ ప్రాకృతిక సౌందర్యం నన్ను ఇట్టే లాగేసుకుంది.

ప్రభ :- ఈఅనుభవంమీద గేయం ఏదీవ్రాయలేదా?

అ :- ఇటువంటి అనుభూతి చాలాసార్లు నాకు కలిగింది. అది గేయంలో వ్యక్తం చేశానుగూడా.

ప్రభ :- మరి అయితే అది నాకు వినిపించవూ ?

అ :- విను:

నీల వేణీ!
నీ వినీల
కుటిలకుంతల
జాలమ్ములోన,
నా మృగనయనమ్ముల,
మరలింపనొల్ల నే, ఓ బాలా.

ప్రభ :- ఏం, ఎందుకు ?

అ :- పూపొదరిండ్ల
నీలి నీడల,
ప్రకృతికాంత
మాయావాగురుల,
విడలింపనొల్ల నే ఓ బాలా.

ప్రభ :- తర్వాత ?

అ :- రమణీ!
నీరమ్యభవ్య
భ్రూ భంగాలకు,
నామృదుహృదయమ్మును,
గురిగా నొసగజాలనే ఓ బాలా!

ప్రభ

ప్రభ :- ఎందుకేం ?

అ :- లోలతరల
వీచికల,
వేకన్ను విల్లు
పలురంగుల,
విడువనొల్లనే ఓ బాలా.

ప్రభ :- అల్లాగేం !

అ :- కలకంఠీ !
నీకోమలగాన
సుధాసవమును,
నావీనుల దోన్నెల
ఒలకరింపనొల్లనే, ఓ బాలా.

ప్రభ :- అల్లాగేం ?

అ :- కోకిల రాణుల
కమ్మనిపాటల,
తుమ్మెదరాజుల
వీణాస్వరముల,
పారబోయనొల్లనే ఓ బాలా.

ప్రభ :- ఇకముందు వచ్చేది చివరిచరణమా ?

అ :- అవును.
బింబాధరీ!
నీమోవిచక్కెర
వాహినిలో,
నాజీవిత నౌకను
ముంచివేయగానొల్లనే ఓ బాలా.

ప్రభ :- అంతకంటె ఆకర్షణీయమైంది నీకేందొరికింది?

అ :- కిలకిల కిలాడి
పూరెక్కలపై,
ధళధళ మెరిసే - మిలమిల మెరిసే-
మంచుముత్తెముల,
త్యజింపనొల్లనే, ఓ బాలా!

ప్రభ :- అద్భుతంగా వుంది!

అ :- అద్భుతంగా వుందీ అంటే వూరుకోను. నువ్వో ఒక పాట పాడి వినిపించాలి.

ప్రభ :- నే వ్రాసిందేనా?

అ :- మొదటి రచనఅని ఇందాక చదివావే! ఇంకానీవు వ్రాసినవి ఏమున్నాయి?

ప్రభ :- ఐదారున్నాయి.

అ :- మరిఅవినాకు చూపించలేదేం ప్రభా!

ప్రభ:- నువ్వేమన్నా తప్పులు పడతావేమోనని బిడియం వల్ల.

అ :- నాముందర బిడియమేమిటి నీకు ? పో ప్రభా.

ప్రభ :- (వెళ్ళిపోవడానికి రెండడుగులు ముందుకు వేస్తుంది.)

అ :- (ముందరికి వెళ్ళి జబ్బపట్టుకొని వెనక్కి లాగి)పోతున్నా వేమిటి?

ప్రభ :- మరి నువ్వేగా పో ప్రభా అన్నావు.

అ :- బాగా అర్థంచేసుకున్నావులే నన్ను! వినుపించు నీ గేయం. నాపాటవిని దానికి కానుక చెల్లించకుండా తప్పించుకొని పోదామనుకున్నావేం ? నానుంచి తప్పించుకొని పోగలవా ?

ప్రభ :- నాశరీరం వున్నంతవరకూ నీనుంచి తప్పించుకొని పోలేను. నిజమే ?

అ :- పిచ్చిమాటలు మాట్లాడుతావేం ? పాడు, నీ గేయం.

ప్రభ :- (నవ్వి) విను.

* నిరంతరము నే
ఊదెడు బుడగలు,
రమ్యసుందరమైన, నీటిబుగ్గలు,
చేబట్టును ఆకసమార్గము,
చేరజాలవు స్వర్గద్వారము,
అవని వీథుల అంతర్ధానము.
నేకన్నకలలు - నే సృష్టించెడు బుడగలు,
మిథ్యలు, మాయలు, మృగతృష్ణలు !

* ('అతడు - ఆమె' నవలనుండి.)

అ :- ఏమిటి ప్రభా! కలలూ, బుడగలూ, నీటిబుగ్గలూ, మిథ్యలూ, మాయలూ, మృగతృష్ణలూ!! ఇదేం కవిత్వం?

ప్రభ :- అదే జీవితం.

అ :- ( దుఃఖపూరిత వాతావరణంలో మునిగిపోయి వుంటాడు. ) ప్రియా, ( ఘోష్ ఆమెవైపు తలఎత్తి ఆమె కళ్లల్లోకి చూస్తాడు. దుఃఖచ్ఛాయలు తొలగిపోతవి, అతని మొగం మల్లె పూవులా మళ్లీ విరిసింది. )

ప్రభ :- చూడు నువ్వు కాశ్మీరము వెళ్ళివచ్చాను అని ఒకసారి చెప్పావు. అక్కడ వుండగా వ్రాసిన గేయాలలో ఒక గేయం చదువు.

అ :- చదువుతాను.

* ఈ పుడమిలో
నీ వొక్కత్తెవే నాస్త్రీవి - నే నొక్కడనే నీ ప్రియుడను,
అటులైతే ప్రపచం ఎటులైనా కానీ!
అనాది నుంచీ
ఆదెమ్మకు మల్లే - ఆదెయ్యకు మల్లే
నవ్వులతో, పువ్వులతో, సరసంతో, సంసారం!
యీ ప్రపంచం,
ఒక కందర్పవనం - మన యిద్దరికొరకే ప్రత్యేకం,
ఆశలు, వూసులు, కోర్కెలు రేపించే యీ లోకం
మన్మథపట్నం,

---

* ( అతడు - ఆమె నవలనుంచి )

ప్రభ

మకర పతాకం, మధురా రాగం -
మన సంతోషం, హాయి నిరాటంకం.
మన సయ్యాటలు, పాటలు, సీతులు నిరాఘాటం!!!

ప్రభ :- ఓహో!

అ :- ఈ మేదిని
నీవే నావలపుల రాణివి, నేనే మదనకామరాజుని.
రాజుగ రాణిగ మనదే - మారుని రాజ్యం!
వెన్నెల పండుగలో
పాడెద నా ప్రేమ గీతిక నీ చెవిలో -
వికసించును నీ నవ్వులు నామెదలో
మన ప్రణయం, మనకాహారం, పంచభక్ష పరమాన్నం!!
అటులైతే
మనకింకేం కావాలి? - ప్రపంచం తలక్రిందులు కానీ,
భూచక్రం ఎటులైనా పోనీ.

ప్రభ :- ఎంత అఖండంగా వ్రాసేవు.

అ :- మరి మా కాశ్మీరంఅంటే ఏమనుకున్నావు ప్రభా? అక్కడ ఎండిన మోడులు ఒక్క ఱాత్రిలో పూస్తాయి, కాస్తాయి. ముసలోళ్ళు వయసోళ్ళవుతారు. అందుకే అది భూతలస్వర్గంఅన్నారు. ప్రతివ్యక్తీచచ్చేలోపల ఒక సారి అక్కడకు వెళ్ళిచూడాలి. లేకపోతే యీ జన్మ వృథా, వృథా, వృథాఅని నామతం. మనయిద్దరం వచ్చే ఎండాకాలంలో వెళ్ళుదాం. ఏం?

ప్రభ :– (నిట్టూర్చి) జీవితం బుద్బుదప్రాయం. మృత్యువు ప్రతి వారినీ నీడలా ఎల్లప్పుడూ వెన్నంటి వుంటుంది. బ్రతికి బాగుంటే, అప్పటికి చూద్దాంలే.

అ :– ఏమిటీ? ఉండి ఉండి అశుభంమాటలు మాట్లాడు తున్నావు ఇవ్వాళ? నాకు కోపంవస్తోంది అమ్మాయి.

ప్రభ :– కోపంవస్తే ధూపం వేస్తాలే. అసలు నేను శాశ్వత సత్యాలు మాట్లాడుతోంటే, నీకు కోపం ఎందుకు?

అ :– వాటిజోలి ఇప్పుడు మనకెందుకు?

ప్రభ :– నామీాదకూడ నీకు కోపంవస్తుందీ?

అ :– నీమీాద కోపంఅంటే నామీాదేగా ప్రభా.

ప్రభ :– అది నాకు తెలుసు ఘోషూ.

అ :– మళ్ళీ మన సంభాషణసూత్రం తెగిపోయింది.

ప్రభ :– నేను జ్ఞాపకంచేస్తాను. అదే,అదే, స్వలాభాలకోసం, దానదక్షిణలకోసం అన్నావు.

అ :– అవును, అవును.

ప్రభ :– యింతకినీకు జన్మతః ప్రాప్తించిన బ్రాహ్మణమతం నుంచి నీకు కలిగిన విముఖత్వానికి నేనే కారణం అన్న మాట.

అ :– అయినా అభ్యంతరంలేదుప్రభా. బ్రాహ్మణమత, బ్రాహ్మణకుల దురభిమానం మన యిద్దరినీ విడదీయా లని చూస్తే అదినాకు విసర్జనీయం.

ప్రభ :– చూడు! నీవు నన్నింతగా ప్రేమిస్తావెందుకూ?

ప్రభ

అ :— నీఅనురాగం లేకపోతే (నిట్టూర్పు) నేనుజీవచ్ఛవాన్నే. ప్రభా, నేను నిన్న నేర్పిన గేయం నీనోట వినాలనివుంది. పాడవూ ప్రభా ?

ప్రభ :— నీఆజ్ఞ శిరోధార్యం. విను:

* అనంతసముద్రం అట్టడుగున,
ఆణిముత్యాలజోడు,
సముద్రపుటొడ్డున,
ఆలుచిప్పల జత,
కాలవాహినిలో
పిల్లకెరటాల జంట.
సూర్యరేఖలో రెపరెపలాడే
రేణువులు రెండు.
తామరకొలమున, తలలూచే
తెల్లకలువ, ఎర్రకలువ.
గగనపథాన్న మెరుపులు మెరిసే
తారాద్వయం.
ఈ విశ్వరూప ప్రపంచంలో
నువ్వూ నేనూ !! (కిలకిల నవ్వుతుంది)

అ :— (తన్మయత్వంతో వింటాడు) నాపాటకు జీవంపోశావుప్రభా.

ప్రభ :— అయితే నాకు ప్రతిఫలం ఏమిస్తావు ?

అ :— ఆఒక్క—నాప్రేమతప్ప, యింకేదియివ్వమన్నాయిస్తాను.

---

* ("అతడు-ఆమె" నవలనుంచి)

ప్రభ :- అల్లాఅయితే విను. నాప్రేమమాత్రం, అమరజీవి అయిన అశ్వఘోషునికి అణుమాత్రమైనా హాని కలుగ జేయకూడదు. అలా కలుగజేస్తే అట్టి ప్రేమకు దూరం నుంచి సాష్టాంగ నమస్కారము.

అ :- చాలా గూఢమైన భాషలో మాట్లాడుతున్నావు? నీఉద్దేశ్యం బోధపడుటలేదు ప్రభా.

ప్రభ :- గూఢమేముంది, స్పష్టమేగా. మన దివ్యప్రేమకు, ఆటంకాలు కలుగజేయడం నావుద్దేశ్యంకాదు. కాని ఆప్రేమ-ఆప్రేమ నీచేత నీకు శాశ్వతకీర్తిని కలుగజేసే వాటిని సృష్టించాలి. అందుకోసం నేను చనిపోయినాసరే.

అ :- (చివాలునలేచి ఆమెబుగ్గలు నిమురుతాడు; వేళ్ళతో ఆమె కురులను దువ్వుతాడు లాలనగా. అతని కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగినవి. నిట్టూర్చి) ప్రభా! అల్లా అనబోకు, అల్లా అన బోకు.

ప్రభ :- అననులే. నాప్రేమ నిన్ను ఒకగొప్ప పురస్కారము కోరుతూంది. ఇస్తావా? యివ్వవా?

అ :- నీకు యివ్వగలిగినది నావద్ద యింకా ఏమి మిగిలివుంది?

ప్రభ :- నామాటలకు మధ్యగా రాకు. నన్నీవాళ పూర్తిగా చెప్పనీ.

అ :-ప్రభా! ఏదో భయంకరమైన విషయము చెబుతావేమో అని నాకు చాలా భయంగావుందిప్రభా.

ప్రభ :- (గంభీరంగా) కాని నా అశ్వఘోషునికల్యాణంకోసం

ప్రభ

నేను చెప్పకతప్పదు. నువ్వు నీ అమరకావ్యాన్ని ఎలాగు ర్తిస్తున్నావో అల్లాగే నన్నూగు ర్తించాలి. నా శరీరాన్ని కాదుసుమా. శాశ్వతఅశ్వఘోషుని; శాశ్వత ప్రభ, శాశ్వతంగా శాశ్వతయావన సౌందర్యాలతో విరాజిల్లాలి. ఈ నా చిన్నకోరికను మన్నించవూ ?

అ :- ప్రిభా, చిక్కులో పడేశావునన్ను. నువ్వు కోరడం, నేను నిరాకరించడమూనా ? కాని ప్రభా, నువ్వు అసలు ప్రభనుకాక, ఊహాప్రభను నా ఎదుట వుంచాలని - నాకు వదలిపెట్టాలని - ప్రయత్నిస్తున్నావా ?

ప్రభ :- ఇక్కడే నువ్వునన్ను బాగాఅర్థం చేసుకోవాలి. నీలో యిద్దరు వ్యక్తులున్నారని చెప్పేనే - నాలోనూ రెండు రూపాలున్నాయి. యీ రెండూ నాకు సత్యాలే. అందులో ఒకామెకు కాలస్థల పరిమితి వున్నది. రెండో ఆమె కాల స్థల పరిమితిరహిత. మొదటి ఆమె నశ్వరం, యిక రెండో ఆమె అన్ననో అజరామరం.

అ :- ప్రభా, ఇన్నాళ్లూ నేను గొప్ప ప్రజ్ఞావంతుణ్ణని నాకు అహంకారం వుండేది. నువ్వునాకు చెప్పేది నా మనస్సుకు పట్టడంలేదు. నా అహంకారము పటాపంచలై పోయినది.

ప్రభ :- ఘోష్! కాస్త నీలోవున్న మాయాతెరను తొలగ జేసుకో నీకంతా తేటతెల్లం అవుతుంది.

అ :- నువ్వు చివరికి తేల్చేది ఏమిటి ప్రభా ?

ప్రభ :- నీప్రభ, నీ పూర్వశీవియోగనాటకంలో శాశ్వతంగా నిలిచిపోయింది. ఇక నా ప్రేమకు అ మ ర త్వం ఆపాదింప జేయడానికి, నువ్వు అజరామరుడైన అశ్వఘోషుడవుగా అయిపోవడానికి, నీధ్యేయంగా పెట్టుకొని ప్రయత్నము చేయాలి. ఆ భిక్షమే నాయీ జోలెలో వెయ్యాలి.

అ :- ఏమిటో ప్రభా, ఇవ్వాళ నువ్వు మాట్లాడేవి అన్నీ విడదీయరాని చిక్కుసమస్యలే. నాకేమీ పాలుపోవడం లేదు.

ప్రభ :- ఇవ్వేళ్టికి పోనిలే. అటుచూడు చంద్రుడు అస్త మించాడు; ఆకాశం అంతా నక్షత్ర ఖచితమైపోయింది; చీకటి పడింది. (ఇంకోవైపు చూచి) సరయూనదిఅలలు పడుతూ లేస్తూ గలగల ధ్వని చేస్తూ నన్ను పిలుస్తు న్నట్లున్నవి. ఇంటికి పోదాం రా.

అ :- అలలు నిన్ను పిలవడమేమిటి ప్రభా ? ఇవ్వాళ నేను నీకు చాలా కృతజ్ఞుణ్ణి. ఈ దినం నా జీవితంలో ఎన్నడూ మరపుకు రాదు. ప్రభా, నీ ఈ క్రొత్తప్రభా రూపాన్ని నా హృదయంలో శాశ్వతకాలంగా హత్తుకొని పోయే టట్లు కాస్సేపు కళ్ళుమూసుకొని ప్రయత్నంచేసి చూస్తాను.

(కళ్ళు మూసుకుంటాడు అశ్వఘోషుడు. ప్రభ దగ్గరగా జరుగుతుంది. అతని గిరజాల ముంగురులను తన సున్నితమైన వ్రేళ్ళతో సవరిస్తూ అతని ఫాల భాగాన్ని తదేక దీక్షతో చూస్తూ వుంటుంది.

అశ్వఘోషుడు కళ్ళు తెరుస్తాడు. ఆమెకళ్ళల్లోకిచూస్తాడు.) ఇవ్వాళ నువ్వు చూపించిన సుందరచిత్రం నాహృదయంలో హత్తుకు పోయింది. ఈ రమ్య భవ్య దివ్యచిత్రాన్ని ఇంక ఎన్నడూ మరచిపోలేను.

ప్రభ :- ప్రియుడా! నాప్రియుడా! ఘోష్! నా ఘోష్!! నా జన్మ తరించింది; నా తపం ఫలించింది; నా జీవితం సార్థకమైంది. నాకు అదేకావాలి. నాకు కావలసింది అంతే. అది ఒక్కటే.

(తెరపడును)



# ఏడవ దృశ్యం

## బౌద్ధ విహారం

(మహాభిక్షువు, త్రిపిటక ఆచార్యుడు, ధర్మరక్షిత్ ఆసన ముద్రలో కూర్చొని వుంటాడు. ముందు చిన్న చైత్యం. తెరమీద బుద్ధుని చిత్రం, అభయహస్తముద్రలో. అతని పాదాలవద్ద అనేక భిక్షువుల, భిక్షురాండ్ర చిత్రాలు. ధర్మరక్షిత్ కళ్ళు మూసుకొని

"బుద్ధం శరణం గచ్ఛామి,
సంఘం శరణం గచ్ఛామి,
ధర్మం శరణం గచ్ఛామి."

అంటూఉంటాడు: ముందుగా ప్రభా, ఆమె వెనుక అశ్వఘోషుడు రంగస్థలంమీదికి వస్తారు. ఇద్దరూ ఆపాద మస్తకం పట్టు వస్త్రాలు, ఆమెవి నీలిరంగు; అతనివి లేతగులాబిరంగు. ప్రభ ధర్మరక్షిత్ పాదాలకు మ్రొక్కుతుంది. అశ్వఘోషుడూ ఆమెను అనుసరిస్తాడు. యిద్దరూ ధర్మరక్షిత్ ఎదుట కుడియెడమ ప్రక్కల ఎదురుకోలుగా కూర్చుంటారు. ధర్మరక్షిత్ మెల్లగా కళ్ళు తెరుస్తాడు. ముందు అతని చూపు ప్రభ మీద పడుతుంది. తరువాత తలత్రిప్పి అశ్వఘోష్‌ని చూస్తాడు. చిరునవ్వు నవ్వుతాడు. ధర్మరక్షిత్ సార్థకంగా సాభిప్రాయంగా ప్రభవైపు చూచి చిరునవ్వు నవ్వుతాడు, నవ్వుతూనే ఇద్దరి శిరస్సుల పైనా తన హస్తం ఆశీర్వాద సూచకంగా వుంచుతాడు.)

ప్రభ :– మహాప్రభూ! ఈయనను తమరు ఎరుగుదురు గదా?

ధర్మ :– (నవ్వి) ఈ సాకేతనగరంలో అశ్వఘోషుణ్ణి

పోల్చుకోలేనివాళ్ళు వుండటానికి వీలు వుందా ? ఇతడు మహాకవి, మహాపండితుడు, అశ్వఘోష్ కదా ?
(అశ్వఘోష్ నమ్రతతో తలవంచి 'ఇదంతా పెద్దల ఆశీర్వాదఫలమే' అన్నట్లు చిరునవ్వు నవ్వి ప్రభవైపు గర్భితంగా చూస్తాడు. అటూ ఇటూ చూసి మళ్ళీ ధర్మరక్షిత్ వైపు దృష్టి మరల్చుతాడు.)

ధర్మ :- పుత్రా! విద్వత్త ఎక్కువైనకొద్దీ వినయమూ హెచ్చుతుంది అనడానికి నువ్వే తార్కాణము.

ప్రభ :- మహాప్రభూ, అందుకు సందేహమేముంది ? ఇతనికి తమతో వేదాంతచర్చ సాగించవలెనని కోరికగావుంది. తమకిప్పుడు తీరిక సమయమేనా ?

అ :- అపచారం ప్రభూ ! మహాపచారం, మహాప్రభూ ! తమరి బోధనామృతము ఆస్వాదించవలె ననిమాత్రమే నా కోరిక అని యీమెకు చెప్పాను. కాని మీతో చర్చ సాగిస్తానని నేను ఎన్నడూ అనలేదు.

ధర్మ :- మంచిది పుత్రా. నువ్వు ఏదన్నా అది ఒక్కవస్తువే.

అ :- మహాప్రభూ ! వేదాంతాన్ని బౌద్ధులు ఎలా భావిస్తారు ?

ధర్మ :- మా మతంలో వేదాంతాన్ని బంధనంగా భావిస్తాం.

అ:- అల్లాగైతే బౌద్ధమతంలో వేదాంతానికి స్థానం లేదాఅండీ?

ధర్మ :- లేకేమి. బౌద్ధమతమే వేదాంతం. మేము అనేది అల్లా వేదాంతం మానవులకు సంసారసాగరాన్నుంచి

ఆవలిఒడ్డు చేరడానికి ఒక తెప్పలాఉండాలి. అంతేకాని, అది బంధనంగావుండరాదు. ఇది మా బుద్ధదేవుని ఉపదేశం.

అ :- తెప్పఅంటే అతనిభావం ?

ధర్మ :- చెప్పతాను. నదిని, లేక సాగరాన్ని దాటవలసివస్తే, మానవుడు తెప్పను తయారుచేసుకొని దాని సహాయంతో వీటినిదాటుతాడు. అంతేగాని ఆ తెప్పను తన భుజస్కంధాలపై వేసుకొని మోసుకొనిపోడుగదా ?

అ :- అర్థమైంది మహాప్రభూ. ఇల్లాంటిసత్యాన్ని ప్రకటించగలిగినందులకు సామర్థ్యమున్నవాడు బుద్ధదేవుడు ఒక్కడే అని నేననుకొంటున్నాను. ఈసత్యాన్ని శోధించి దానినుంచివచ్చిన ఆనందాన్ని ఆత్మగతం చేసుకోవడానికి ప్రయత్నించేవ్యక్తి ధన్యతముడు; మానసిక ఆనందంకోసం, నాఅజ్ఞానతిమిరవాతావరణాన్ని పటాపంచలు చేయడానికి, నాలోవున్న తుఫానును శాంతపర్చడానికి, దీనినిగురించి కాస్తవివరంగా చెప్పవలసినదిగా నాప్రార్థన.

ధర్మ :- పుత్రా! నువ్వు సరియైనదారిలో పడినావు. మా మతప్రకారము ఆత్మ శాశ్వతమైనదికాదు. కాని మీ మతప్రకారము అదిఅవినాశి. బౌద్ధుని ప్రపంచంలో శాశ్వతమైనదీ నిత్యమైనదీ ఏదీలేదు. ప్రతిదీ క్షణభంగురము. ఈక్షణంలో జన్మింస్తుంది, వెంటనే మరుక్షణంలో మాయమవుతుంది.

అ :— మహాప్రభూ! ఈభావం నాకు నచ్చుతూంది. దేనికోసం యిన్నాళ్లు నేను అన్వేషించానో, దేనికోసం నేను అహోరాత్రాలు పరితపించానో, నాకుఅది లభ్యమైనట్లు వుంది. బుద్ధదేవుని సిద్ధాంతాలకు అనుగుణ్యంగా నడిస్తే, ఆయన ఉపదేశించిన సూత్రాలను ఆచరణలోనికిపెడితే, యింకో నూతనవిశ్వం ఆవిర్భవించగలదని నావిశ్వాసం.

ప్రభ :— నావిశ్వాసమూఅదే.

ధర్మ :— నిజం పుత్రా! నిజం తల్లీ! ఇదే ఒక మహావిప్లవం.

ప్రభ :— మహాప్రభూ! ఈకాలంలో సకలమానవాళి ఇట్టి విప్లవాన్నే వాంఛించాలి. ఈ విప్లవం తేవడానికి సకల ప్రయత్నాలూచెయ్యాలి.

అ :— ఇదే మనలను అభ్యుదయపథంలో ముందుకు తీసుకొనిపోయేలావుంది.

ధర్మ :— పుత్రా! నువ్వుచెప్పింది సత్యం. యీ ప్రస్తుత విషాద భూయిష్ఠకల్మషపూరిత జగత్తు ఆనందదాయకంగా నిర్మలంగా మార్చగల విప్లవాన్ని బుద్ధదేవుడు కోరేడు. ఆ ఆదర్శప్రపంచాన్ని త్వరగా తీసుకొని రావడానికే అతడు బౌద్ధభిక్షువుల్ని తయారుచేశాడు.

ప్రభ :— హెచ్చుతగ్గులుపోయి వర్ణ, వర్గ భేద రహిత సమాజాన్ని స్థాపించడానికే కాదాప్రభూ?

ధర్మ :—అవునుప్రభా. అందరికీ సమానంగా కష్టసుఖాలు వుండేలాగు, ఈ ప్రపంచాన్ని—అందరికీ సమానఅవకాశాలు

గల ప్రపంచాన్ని సిద్ధంచేయడమే బుద్ధదేవుని ఉదాత్త మతంయొక్క చరమలక్ష్యం. చూడుపుత్రా! మహామహుడగు ధర్మసేన్ చీపురు చేతబుచ్చుకొని వీధులు శుభ్రం చేయడం నువ్వు ఎప్పుడైనా చూచావా?

అ :- మొన్నవచ్చినప్పుడు చూచినాను, ఆ నల్లటిమహానుభావుడేనా మహాప్రభూ?

ధర్మ :- అవును. అతడే ధర్మసేన్. అతడు మౌనవ్రతధారి. అతడే ఈ కోసలరాజ్యంలోని అన్నివిహారాలకూ ఉన్నతాధికారి.

ప్రభ :- నాజ్ఞానానికి క్షమించండి మహాప్రభూ. శ్రీకృష్ణుడు కూడా ఇలాంటిపనులే చేస్తూవుండేవాడని నేను మహాభారతంలో చదివాను.

ధర్మ :- శ్రీకృష్ణుడా! భగవద్గీతను అర్జునునికి ఉపదేశించిన శ్రీకృష్ణుడేనా?

అ :- అవునుప్రభూ అతడే.

ధర్మ :- అతడేంచేసినాడు ప్రభా?

ప్రభ :- వీధులు వూడ్చడంఅంటే నాకిది జ్ఞాపకం వచ్చింది. రాజసూయయాగం పాండవులు చేస్తూవున్నప్పుడు, అందరూ భోజనాలు చేసినతరువాత శ్రీకృష్ణుడు తన చేతులతో ఎంగిలి విస్తళ్ళుఅన్నీ ఎత్తి పారవేశేవాడని మహాభారతకారుడు వ్రాసినాడు.

ప్రభ

ధర్మ :- అల్లాగా ప్రభూ ? ఇది చేసినందులకు అతనికి చేయెత్తి నమస్కరిస్తున్నాను.

ప్రభ :- అంతేకాదు మహాప్రభూ! భారతయుద్ధం జరిగి నన్నాళ్ళూ ప్రతిదినం సాయంకాలం అయ్యేది, సూర్యుడు అస్తమించేవాడు. అందరూ సంధ్యావందనానికి వెళ్లేవారు. కాని శ్రీకృష్ణుడో ? తన గుర్రాలకు తగిలిన బాణాల్ని తీసివేశేవాడు, గుర్రాలకు తగిలిన గాయాలకు మందు వేసేవాడు; వాటికి దాణాపెట్టేవాడు.

అ :- ఇదికూడా మహాభారతంలోనే వర్ణింపబడి వుంది మహాప్రభూ. ఈ ఘట్టాన్ని, ఈ సువర్ణఘట్టాన్ని జ్ఞాపకం చేసిన, ప్రభ - నా ప్రభ సార్థక నామధేయ.

ధర్మ :- నీతో సహవాసం చేసినతరువాత, పుత్రా మా ప్రభ మీా భారతం చదవడం ఎంతో ముదావహాము.

ప్రభ :- ప్రభూ! ఆ దాణాకూడా శ్రీకృష్ణభగవానుడు తన పట్టు పీతాంబరంలోవుంచి గుర్రాలకు తినిపించేవాడు.

అ :- ఆ సుందరదృశ్యం యే చిత్రకారుడూ యింతవరకూ చిత్రించలేదేమి ?

ధర్మ :- పుత్రీ! అది అద్భుతదృశ్యం. అది తలచినకొలదీ నా శరీరంలోని రోమ రోమమూా, అణువు అణువూా, గగురు పాటు పొందుతూఉంది.

ప్రభ :- ఇదిఎంత సుందర దృశ్యము ? వ్యాసదేవుని కల్పనకు పరకాష్ఠకాదూ ఇది మహాప్రభూ ?

ధర్మ :- నిశ్చయంగా ఇకమనం చర్చ సాగిద్దాం. పుత్రా! మా బౌద్ధ విహారాలలో కుల భేదాల్ని పాటించము. ఇక్కడ మానవుల గుణాలకే ప్రాధాన్యత యిస్తాము. ధర్మసేనును గురించికాదూ నేను చెప్పతూఉంట? అతడు విజ్ఞానఖని, సుగుణ సంపత్తులు గలవాడు. అతడు భిక్షా వృత్తితోనే తన శరీర యాత్ర సాగిస్తూవుంటాడు. లభ్యమైంది కొద్దిదైనా దానిలో సగంభాగం ఆకలిగొన్న పేద వారికి - వాళ్లు ఏమతం వాళ్లయినా - పంచిపెట్టకుండా తాను ఎన్నడూ భుజించడు.

అ :- ఎంతగొప్పవాడు అతడు మహాప్రభూ! ప్రాచీనకాలంలో మాఋషులు,మునులు యిల్లాగేచేసేవారు. కాని ఇప్పుడది జరగటంలేదు. మహాప్రభూ! బుద్ధమతంలో స్వంత ఆస్తికి చోటువుందా?

ధర్మ :- పుత్రా! మామతప్రకారము మానవునికి మూడు వస్తువులే స్వంతఆస్తిగా వుంచుకోడానికి అధికారముంది.

అ :- ఏవి అవి ప్రభూ?

ధర్మ :- మొదటిది భిక్షాపాత్ర, రెండవది మరచెంబు, మూడవది కొయ్యదువ్వెన. వీటినే స్వంతఆస్తిగా మానవుడు పరిగణించాలి, అని మామతం చెబుతూంది.

అ :- మరి మీామతప్రకారం ఇళ్ళు, తోటలు, భూములో?

ధర్మ :- అవన్నీ ఏఒక్కడి స్వంతసొత్తుగాదు, అది అందరి వుమ్మడిసొత్తు.

ప్రభ

అ :- ఏంగొప్పమతం మీ బౌద్ధమతం ? నేనూ యీ విషయమే ఆలోచించాను. యీ స్వంతఆస్తియే సమాజ సుఖానికి వేరుపురుగు. ఈ ప్రపంచంలోగల అన్నిరకాల అనర్థాలకూ మూలం యిదే అని నాకు తమవద్దకు రాకమునుపే గాఢమైన నమ్మకం ఏర్పడింది. నాకిప్పుడు మీ బౌద్ధమతం పూర్తిగా నచ్చింది మహాప్రభూ.

ప్రభ :- ధన్యోస్మి. ఈ దినం సుదినం, పర్వదినం.

ధర్మ :- ఇదంతా బుద్ధదేవునిదయ ప్రభా. పుత్రా ! ఇక నన్ను క్షమించు. నా విహారంలోని వ్యవహారాలుకొన్ని చూసే సమయమైంది నాకు.

అ :- మహాప్రభూ ! మీకు యీనాడు యీకష్టం కలిగించినందులకు నేను క్షంతవ్యుణ్ణి.

ధర్మ :- కష్టమేముంది ? నా ధర్మం యిదేగా.

అ :- మహాప్రసాదం, మహాప్రభూ. మీ ప్రభ నన్నిక్కడకు తీసుకొచ్చి నాకో క్రొత్తవెలుగు చూపించింది, తమద్వారా. ఆమె చేసిన ఈ మేలును ఎన్నటికీ మరువలేను. ఏమంటావు ప్రభా ?

ప్రభ :- అనేదేముంది.? ( అందరూ లేస్తారు, నంచుంటారు ధర్మరక్షిత్ పోతూ )

బుద్ధం శరణం గచ్ఛామి,
సంఘం శరణం గచ్ఛామి,
ధర్మం శరణం గచ్ఛామి.

( ధర్మ వెళ్లిపోతూవుంటాడు. వీళ్లిద్దరూ సామాజికులవైపు తిరిగి ఒకేసారి చేతులుమోడ్చి తలవంచుకొని దీనినే పునశ్చరణ చేస్తారు. నేపథ్యంలోనుంచి శంఖాలు వూదబడుతవి, తెరపడును. )



# ఎనిమిదవ దృశ్యము

(ఉద్యానవనం, పున్నమరేయి, ప్రభ అశ్వఘోషులు చెయ్యి చెయ్యి కలిపి నడుస్తూ రంగస్థలంమీదికి ప్రవేశిస్తారు. ప్రభ పూలమయం కావాలి. అశ్వఘోషుని మెడలోనూ పూలదండ, పట్టు దుస్తులే.)

ప్రభ :- ప్రియా యిదేమిటి ?

అ :- ఏదీ, ఏమిటి ?

ప్రభ :- కొన్నాళ్ళనుంచి ఇక్కడవున్న ఇంట్లోవున్నా, మేలుకొనివున్నా, నిద్రిస్తూవున్నా, ఆ సరయూనదీతరంగాలు నన్ను మాటిమాటికీ తమవద్దకు రమ్మనమని పిలుస్తూ వున్నట్లు నా అనుభూతి.

అ :- బహుశః నీవొక మహాభ్రాంతిలో పడిపోయేవేమో ప్రభా !

ప్రభ :- పో ఘోష్, నువ్వు మహాభ్రాంతి రహితుడవైనట్లు ? మన వుభయుల స్నేహానికి స్నేహబంధనానికి, అట్టి బంధనంలో మనలను కట్టివేసిన మోహానికి, కారణం ఆ కెరటాలే.

అ :- మళ్ళీ మోహం అంటున్నావేం ? మన యిద్దరిమధ్యా ఉన్నది మోహంకాదు ప్రభా, అది ఒక పవిత్ర అవర్ణనీయ, అనురాగం.కాదు, నా భావాన్ని సరిగ్గా సరియైన పదాలలో వ్యక్తం చేయలేకపోతున్నానేమిటిప్రభా ?

ప్రభ :- ఇదేం విడ్డూరం ? నువ్వు పరిహాసం చేస్తున్నావా ? మహాకవివి ; పండిత ప్రకాండుడవు ; అసదృశకల్పనా సామ్రాజ్యానికి ఏకైక పట్టాభిషిక్త సార్వభౌముడవు, సంస్కృతభాషలోనూ, పాలీభాషలోనూ వాడుకలో వున్న పదాలన్నీ ఎల్లప్పుడూ నీ నలువైపులా విహరిస్తూ, తచ్చాటలాడుతూ, "మమ్మల్ని మీరు ఉచ్చరించండి; మీరు మీ కల్పలనలను అభివ్యక్తం చేయడానికి మీ వాక్యంలో పొందుపరచుకోండి" అని ఒక పదము మరి ఒకదానితో పోటీపడుతున్నాయా అన్నట్లు నాకు తోస్తూంది.

అ :- అదేమిటి ప్రభా ? ఇది నా మనస్సులోని భావమే. నువ్వు ఎలా వ్యక్తపరచావు ?

ప్రభ:- నీ మనస్సూ నా మనస్సూ వేరుగా వున్నాయా ? ఒకటిలో ఒకటి ఇమిడిపోలేదా ?

అ :- అదా కారణం ? నిజమే ప్రభా, కేవలం మన తనువులు వేరేగాని మన మనస్సులు ఒకటేగదా.

ప్రభ :- నమ్మేశావూ నా మాటలు ? ఎంత వెర్రిబాగుల వాడివి ! ఈ నేను పైనచెప్పిన భావం మొన్న ప్రొద్దున్న నువ్వు సరయూనదీతీరాన నాకు చెప్పలేదా ?

అ: – అదా సంగతి ? సరేగాని ప్రభా, మనం కలుసుకొని ఎన్నాళ్ళు అయింది ?

ప్రభ :- రెండేళ్ళు సరిగ్గా నిండేయి, ఈ జన్మలో మాట.

అ :- అంటే ?

ప్రభ :- క్రిందిటి జన్మలో నువ్వు పురూరవుడవి.

అ :- (ఆశ్చర్యోక్తిలోనవ్వి) నువ్వు ఊర్వశివి.

ప్రభ :- అవును, కాని ఒక గమ్మత్తు ఏమిటంటే, మనం కలుసు కొని రెండేళ్లు గడచినా, ఆ ప్రథమ సమావేశం, మొన్న మొన్ననే జరిగినట్లుంది. ఎంతత్వరగా రోజులు గడచి పోయినవి ?

అ :- సంయోగ కాలంలో, సంతోష సమయంలో, ఒక యుగంకూడా ఒక్క క్షణంలా గడచిపోతుంది అంటారు మా పూర్వీకులు.

ప్రభ :- మరి వియోగ కాలంలోనో ?

అ :- ఏముంది ? ఒక్కొక్క క్షణం ఒక్కొక్క యుగంలా తోస్తుంది.

ప్రభ :- ఎన్నిసుఖమయ దినాలను, ఎన్నిరమ్యమైన రాత్రుల్ని, ఆ నదీతీరాన యీపుష్పవాటికలో గడిపినాము? వహావ్వా! అవి ఎంత రమణీయమైనవి! ఎంత స్వారస్యంతో కూడు కొన్నవి! ఎంత హృదయంగమంగా వున్నాయవి!!

అ :- నిజంప్రభా! నా జీవిత కాలంలో యీ పన్నెండు మాసములూ ఒక సువర్ణయుగం. ప్రభా, ఇన్నాళ్లూ ఒక రహస్యం దాచాను నీనుంచి.

ప్రభ :- నా నుంచి కూడా రహస్యం దాచుకొంటున్నావా ? నీవేనేను, నేనేనువ్వు అని పదేపదే నాతో చెపుతూ వుంటావే? అవిఅన్నీ ఉత్తుత్త మాటలేనా ? ఎంతచెప్పినా పురుషులు మోసకారులు.

అ :- ప్రభా, యీ కాస్తదానికిఎంత వ్యాఖ్యానంచేశావు ?

ప్రభ :- పోనీలే, ఆ రహస్యం చెప్పు.

అ :- సారిపుత్రా అని నాటకం ఒకటి వ్రాశాను. అది నిన్న రాత్రే పూర్తి అయింది.

ప్రభ :- అందుకా నీ కళ్ళు అంత ఎర్రబారిఉన్నవి ? అలసట నీ కళ్ళనుంచి తొంగిచూస్తూవుంది ?

అ :- అందువల్లనే ప్రభా ! నిన్న రాత్రల్లా నేను జాగారం చేశాను.

ప్రభ :- పాపం. ఎన్నాళ్ళనుంచో నిన్నొక విషయం అడుగు దామనుకున్నాను. అడగనా ?

అ :- ఒక్కటేమిటి ? కావలసివస్తే రెండు విషయాలు అడుగు. రెంటికీ సమాధానం చెబుతాను.

ప్రభ :- ఒక్కసారే రెంటికీ సమాధానం చెబుతావా ?

అ :- నాకు రెండు నాలుక లుంటేగా ? నేను సర్పాన్ని కాదుగా.

ప్రభ :- ఎంత చమత్కారంగా మాట్లాడుతున్నావు ?

ప్ర భ

అ :- కవులు చమత్కారంగా మాట్లాడకపోతే, వాళ్ళు కవులు ఎల్లాగవుతారు ? అదుగు అసలువిషయం.

ప్రభ :- అది అల్లాఉంచుకాని, నక్షత్రాలమీంద నువ్వు ఇటీవలనే ఒక గేయంవ్రాశావుట. అది నాకు వినిపించవ్వూ ముందు ?

అ :- విను.

* అంతరిక్షమున
మిన్కుమిన్కుమను
అనూనమహా
నక్షత్రములారా !

ఆశ్చర్యాన్విత
మహానామదిలో
సంశయమ్ములు
తీరుస్తారా ?

నక్షత్రమ్మొక
లోకమ్మంటూ
నానాప్రముఖులు
నుడివెదరు,

ఇదినిజమేనా ?
అయితే నాదొక

---

* (శ్రీమల్లాదివారి 'విశ్వవీణ' నుండి)

మనవిని మీ
రాలిస్తారా ?

మాలోకమువలె
మీలోకములో
మనీషులూ మా
నవులున్నారా ?

నానా భాషలు
కలవా ? అచ్చట
నిఖిలజంతు సం
తానమున్నదా ?

పరివారములు
పరితోషములు
పరి వేదనలు
కలవా ? అచ్చట

పాలనమున్నద ?
ప్రజాతంత్రమా ?
పార్థివు లం
దున్నారా ?

మహీధరమ్ములు
మహానదమ్ములు

ప్రభ

మహార్ణవమ్ములా
కలవా? అచ్చట

సుందరతమమహా
ప్రకృతియున్నదా?
సూర్యచంద్రులున్నారా?
ఏం నక్షత్రములారా?

ప్రభ :—బాగుంది, నవీనశైలి, నూతనపంథా.

అ :— అయితేవిను. ఈ సరణిలోనే 'నేను' అనే గేయం ఇంకొకటి వ్రాశాను.

ప్రభ:— చాలు లేఇంక.

అ :— అల్లా నిన్ను విడిచిపెట్టే ఘటంకాదు ఇది.

ప్రభ :— సరే, వింటా.

అశ్వ :—

నేనను వ్యక్తిత్వమొకటి
నాయను కర్తృత్వమొకటి
నాదను అస్తిత్వమొకటి

అమరినవి ఇవి ఏనాడో?
అమరినవి ఏహేతువుననో?

కన్నులగాంచిన సర్వము
వీనులవిన్నది ఎల్లను

మనసునకు అందినదంతయు
మరితరచగ నేనుకాను.

నాదిఅన్నది మున్నెవరిదో?
ముందిక ఎందరిదోనో?
ఎన్నిరీతులుగా మారునో?
ఏ యే రూపములందునో?

'నా' కలది అన్నిటిలోనను
'నే' సమము అన్నిటియందున
నాకంటెను భిన్నమొకడు
నేగనజాలను భువిలో.

అధికులెవరు కానరారు
అధములంచు లేనేలేరు
అహమందరిలోనొకటే
అసమానత ఘననేరము.

ప్రభ :- (చప్పట్లు కొట్టుతూ) అద్భుతం! ఎల్లాంటి శాశ్వత సత్యాలను వ్యక్తపరిచావు నువ్వు!

అ :- అదేగా కవిచెయ్యవలసింది.

ప్రభ :- సరేకాని, కవులు ఎక్కువగావ్రాసేది రాత్రికాలంలో, దీనికికారణం ఏమిటి?

అ :- మా భగవత్ గీతలో 'యస్యాం జాగ్రతిభూతాని, సా నిశా పశ్యతో మునేః' అని వుంది. అంటే ......

ప్రభ :- ఆమాత్రం నాకూ తెలుసులే. ఏవేళల సామాన్య మానవులు మేలుకుంటారో ఆవేళల మునులు నిద్రిస్తూ వుంటారని. తతిమ్మా చరణం అర్థంచెబుతా. ఏవేళల సామాన్య మానవులు నిద్రిస్తూ వుంటారో ఆ వేళల మునులు మేల్కొనివుంటారు; కదూ?

అ :- అవును.ప్రభా భగవత్ గీతఅంతా కంఠస్థం చేసినట్లుందే నువ్వు?

ప్రభ :- అవునుఘోషూ. నువ్వు నా బుద్ధమతగ్రంథాలు తరచి తరచిచదువుతూ వున్నావు, నేను మీ పవిత్రగ్రంథాలు చదువుతున్నాను.

అ :- అలావుండాలి, పరస్పర సాంస్కృతిక ఆదానప్రదానం. ఇల్లా యీ విశ్వంలోని సకలజాతులూచేస్తే, విశ్వమానవ సౌభ్రాతృత్వం ఏర్పడుతుంది. కవులుకూడా మునులవంటి వారు; ఋషులవంటివారు, 'నానృషిః కురుతే కావ్యం' అన్నారు పెద్దలు. కవిగూడా ఒకయోగి, ఒకసాధకుడు, ఒకతపస్వి. తెలిసిందిగాదూ నీకు ప్రభా?

ప్రభ :- బాగాతెలిసింది. ఘోషూ! నువ్వు ఎప్పటికైనా తీరికవున్నప్పుడు రెండుకావ్యాలు వ్రాయాలి అని నా సంకల్పం.

అ :- ఏవి అవి?

ప్రభ :- ఆ కావ్యాలకు పెట్టవలసిన పేర్లుమాత్రంచెపుతాను.

అ :- సరే, ఒప్పుకొన్నాను. పేర్లు చాలా అందంగావుండాలి సుమా.

ప్రభ :- బుద్ధచరిత్రము.

అ :- రెండోది ?

ప్రభ :- సౌందరానందము.

అ :- సరేప్రభా అందుకు చాలా కాలంపడుతుంది; చాలా సామగ్రి ఎన్నోచోట్లనుంచి ప్రోగుచేసుకోవాలి. నాకు తీరిక దొరకందే ?

ప్రభ :- ఇప్పుడుకాదు లే.

అ :- మరెప్పుడు ?

ప్రభ :- బాగా తీరిక నీకు లభ్యమైనప్పుడు. ఇటుచూడు, ఇసుక నాపాదాలకు తగులుతూంటే ఎంత హాయిగా వుందో !

అ :- అవి నీపాదాలకు చక్కలిగింత పెట్టినట్లుగాలేదూ?

ప్రభ :- నాశరీరం యావత్తూ, గగుర్పొడుస్తూవుంది.

అ :- ప్రభా, ఎందుకో ? ఏలనో ? ఒక్కొక్కప్పుడు నాకు అనిపిస్తుంది, ఈ ప్రపంచం వదిలి మనిద్దరం,-మనిద్దరమే-ఏ దూరదేశానికో పారిపోవాలి అని.

ప్రభ :- నాకూ అల్లానే అనిపిస్తూంది. మన పవిత్ర ప్రేమను

చూచి అసూయపడే వారెవ్వరూ లేని ఒక క్రొత్త ప్రపంచానికి పోవాలని.

అ:- నువ్వు నన్ను ఉత్తేజపరిచి వ్రాయించిన గేయాలని అక్కడ నీవు ఏకాంతంలో వీణమీద వాయిద్దువుగాని.

ప్రభ :- ఏం పగటి కలలు కంటున్నావు ?

అ :- కలలు కాంచలేనివాడు కవి కాలేడు ప్రభా.

ప్రభ :- అట్టి కలలు కంటూ యీ వాస్తవిక ప్రపంచాన్ని, నన్నూ, మరిచి పోవుగదా, కొంపతీసి ?

అ :- ప్రభా, కలలు కంటూనే వుంటాను. వాటి అడుగున భూమిక్రిందప్రవహించే అంతర్వాహినిలా నీవు వుండనే వుంటావుగా.

ప్రభ :- ధన్యోస్మి! ధన్యోస్మి! నన్ను అపార్థం చేసుకోకుండా వుంటానంటె నా దొక్కమాట.

అ :- అశుభం పలుకవుగదా ? కాదులే, ఈ మధ్య మాటి మాటికి సుస్వరంలో అపస్వరంలా అశుభాలు పలుకుతున్నావులే.

ప్రభ :- అదే నేను చెప్పేది. అశుభంగా నీవు భావించనంటే ఆ మాట చెపుతాను.

అ :- (నిట్టూర్పుతో) చెప్పు ప్రభా, చెప్పు.

ప్రభ :- ఒక వేళ-మాటవరసకంటున్నాను. నేను మరణిస్తేనో ?

అ :- ఇవేం మాటలు ? నీకంటె ముందే నేనే మరణిస్తాను.

ప్రభ :- అది మన చేతుల్లో లేదు. కాలము ఎల్లా నిర్ణయిస్తుందో ?

అ :- అదీ నిజమే ప్రభా! ఎవరు చెప్పగలరు ?

ప్రభ :- నేను నీకంటే ముందుగా పరమపదిస్తే...

అ :- వద్దు ప్రభా. నీవు ఎల్లకాలం జీవించు. నా ఆయుస్సును కూడా తీసుకొని ఆ చంద్రతారార్కం జీవించు ప్రభా.

ప్రభ :- నన్ను చెప్పనీ. చెప్పమన్నావు, చెప్పటానికి మొదలెట్టేసరికి మాటమాటకు అడ్డువస్తున్నావు.

అ :- ఇంక రానులే. నిరాఘాటంగా చెప్పు.

ప్రభ :- ఒక్కసారి ఊహించుకో. కేవలం ఊహాలోనేలే.

అ :- అది నేను సహించలేను ప్రభా. పోనీ ఒక్కసారి నీవు ఊహించుకో. నేనే నీకంటే ముందుగా పరమ పదిస్తేనో? అల్లా ఊహించుకోరాదా ? ఊహాలోనే లే.

ప్రభ :- సరే, అల్లానే ఊహిద్దాం. మీ పురుషజాతి మంచి జాతి; అన్నిటిలో మీరే గెలవాలి. మీరే ముందడుగు వేయాలి. సరే, నువ్వే నాకంటే ముందుగా పంచత్వం చెందితే, నేను ఒంటరి దాన్నైపోతా.

అ :- (నవ్వి) అల్లా దారికి రా ప్రభా.

ప్రభ :- దారికిరాక మరేమీ దారిలేదు. నీ మరణాన్ని

గురించి ప్రస్తావిస్తే, నువ్వు నిశ్చలంగా వున్నావు. నిన్ను కోల్పోతే నేనుమాత్రం అగాధ విషాద సాగరంలో మునిగిపోనూ ?

అ :- మరినువ్వు మరణిస్తే, నాకు అసలు అస్తిత్వమే లేదుగా. ప్రభా, యిటువంటి సంగతులుచెప్పి నా మనస్సును కష్టపెట్టకు.

ప్రభ :- ఈజీవితం బుద్బుదప్రాయం. యీతనువు క్షణభంగురం. జీవితంలో ద్వంద్వాలుఉన్నవి. మీ వేదాంతం అదే చెబుతుంది. ద్వంద్వమయమే ఈ జీవితము. ఎల్లకాలము వెన్నెలరాత్రులేవుండవు. పైగా చీకటిరాత్రులే ఎక్కువగా వుంటాయి. ఇంతకూ నేను చెప్పబోయే దేమిటంటే, మనలో ఒకరు ముందుగా మరణిస్తే రెండవవారు ఏమి చేయాలి, కర్తవ్యమేమిటి ? అని నేను చెప్పబోవుతున్నాను. నిన్ను కోల్పోతే, అబ్బా! నిన్ను కోల్పోతే నేను ఏంచేయాలో తెలుసా నీకు ?

అ :- నాకెల్లా తెలుస్తుందిప్రభా ? అది నీకే తెలియాలి. నీవే చెప్పాలి.

ప్రభ :- సరి. నేనే చెబుతాను, విను. అల్లాంటి దుస్థితి ఏర్పడితే, నన్ను నేను ఎన్నటికీ చంపుకోను. మతాలన్నీ ఆత్మహత్య పాపమని, అది తెలివితక్కువఅనీ వేనోళ్ళ చాటుతున్నవి. అవునంటావా, కాదంటావా ?

అ :- అవును ప్రభా, ఆత్మహత్య అన్ని మతాలలోనూ మహా పాతకం.

ప్రభ :- చూడు ఘోష్, నేను వీణ నెలా వాయిస్తాను?

అ :- (నవ్వి) అందుకు ప్రమాణపత్రం నేను నీకు యివ్వాలా? నువ్వు వీణమీాద నీ సున్నితమైన వ్రేళ్ళతో వాయిస్తూంటే, నేనేమిటి, సకలచరాచరములు, సర్వచేతనాచేతనములు, తన్మయసాగరంలో మునుగుతూ తేలుతూ వుంటవి. ఎన్ని సార్లు అలా జరగలేదు ప్రభా ?

ప్రభ :- అవును ప్రియుడా, (వేడినిట్టూర్పు విడిచి) ఆం ఆ అసందర్భం జరిగితే నా అశ్వఘోషుడు నానుంచి భౌతికంగా వేరుచేయబడతాడు. కాని, శాశ్వతకీర్తి సంపాదించినా, ముందు రాబోయే అన్ని కాలాలకు ఆదర్శప్రాయుడైన కవివరేణ్యుడైన శాశ్వతఅశ్వఘోషుడు నావద్దనే వుంటాడు; నాలోనే వుంటాడు. అతడెప్పటికీ నావాడే. అతని దాననే నేను. నేనప్పుడేంచేస్తాను ? అతని అప్రకాశితమైన గ్రంథరాజాలను వెలుగులోకి తెస్తాను. అతని గేయాలని వీణమీాద వాయిస్తాను. అందరికీ వినిపిస్తాను. అతని గీతాలను గానం చేస్తాను. ఇల్లా ఒక్క భరత వర్షంలోనే కాదు; చెప్పన్న దేశాలలో పూర్వ, పశ్చిమ, ఉత్తర, దక్షిణ దేశాలలో సంచారంచేస్తాను. అదే నాకు పరమ లక్ష్యంఅవుతుంది. అదే నా జీవితంలో నేను చేయవలసిన స్వధర్మాచరణ అవుతుంది. ఇల్లాగ

చేస్తూ నా జీవితం ముగిసిన తరువాత నీవు ఎక్కడఉన్నా అక్కడకు వచ్చి నీలో కలుస్తాను, నీతో ఐక్యం అవుతాను. ప్రియా, నేను మరణిస్తే, నిజంగానే మరణిస్తే, నీవేమి చేస్తావో యిప్పుడు చెప్పు.

అ :- (అశ్వఘోషుని శరీరం కంపిస్తుంది. మాటలు తడబడతాయి. కన్నులు చెమ్మగిల్లుతాయి. ఆమె చేతిని తన చేతిలోనికి తీసుకొని, ఆమె కళ్ళల్లో కళ్ళు పెట్టి ప్రయత్న పూర్వకంగా) ప్ర...భా అ...ది అది అది అది, అది మహా భయంకరమైన ఘట్టము. కాని ప్రభా (తెప్పరిల్లుకొని) నేను మాత్రం నన్ను చంపుకొంటానా? ప్రభా ఆత్మహత్య ఎన్నటికీ చేసుకోను. ప్రభా, నీవు నాలో వెలిగించిన ప్రేమజ్యోతి, నువ్వు నా హృదయంలో స్థాపించిన లావణ్యకాంతి, నువ్వు నాలో కలిగించిన ధర్మజ్యోతి, ఎన్నటికీ ఆరిపోదు. ఎన్నటికీ కుంటువడదు. నేనేంచేస్తాను ప్రభా అప్పుడు? ఏంచేస్తాను, కలం పట్టుకొంటాను. కలం అరిగిపోయేదాకా వ్రాస్తూనే వుంటాను. గానం చేస్తూనే ఉంటాను. జీవితాంతంవరకు అదే నా పరమలక్ష్యమౌతుంది. అదే నా స్వధర్మ ఆచరణమౌతుంది. ప్రభా, నీ శాశ్వత అశ్వఘోషుడు (మళ్ళీ కళ్ళు చెమ్మగిల్లుతవి-మాటలు తడబడుతవి.) నీ శాశ్వత...

ప్రభ :- ప్రియా (గొంతు వేసి) సంతోషం, పరమ సంతోషం,

ఆనందం, బ్రహ్మానందం, యిది బుద్ధదేవుని దయ. బుద్ధ మతాన్ని కూడా ప్రచారం చెయ్యవూ ?

అ :- ప్రభా, బుద్ధమతం నాకు నచ్చింది. ఈ కాలానికి అది ఎంతో అవసరం. అదొక్కటే నానావిధ బాధా దుఃఖాలతో నిండుకొనియున్న, అసమానత్వం విపరీతంగా పెరిగిపోయివున్న పీడన, దోహన, మోసం, వేషం వ్యాపించియున్న ఈ ప్రపంచాన్ని మారుస్తుంది...

ప్రభ :- ధన్యోస్మి! కృతార్థోస్మి! సంతృప్తోస్మి! ఈ నా సంతోషాన్ని వెలిబుచ్చుతూ ఒక నృత్యం చేయనా ?

అ :- అంతకంటె వేరే ఏం కావాలి.

ప్రభ :- (నృత్యం చేస్తుంది. అశ్వఘోషుడి వదనంపై క్రమ్ముకొని యున్న విషాదచ్ఛాయలు తొలగిపోతవి. మళ్ళీ మామూలు వ్యక్తి అవుతాడు.)

ప్రభ :- ఇంక వెళ్లిపోదాం. నువ్వు అందరికీ అర్థమయేలా వ్రాసిన ఇంకొక గేయం ఏదైనా ఒకటిపాడి వినిపించు. అది కాగానే మనమింటికి వెళ్లిపోదాం.

అ :- ఏది వినిపించను ? ఆఁ సరే, విను.

సెప్పు సకియా
నీ లోగుట్టు
సెప్పకుంటివా,
నా మీదఒట్టు ॥సెప్పు॥

ప్రభ

రాగాతీతం
ఒకతడవ
అతివైరాగ్యం
మరుతడవ. ॥సెప్పు॥

చలువ జల్లులూ
ఒక క్షణమూ
వడగండ్ల వానలూ
మరుక్షణము ॥సెప్పు॥

ముసి ముసి నవ్వులు
ఒక నిముసం
మూతి విరుపులు
మరునిముసం ॥సెప్పు॥

ప్రాణం పోసెదవు
ఒకనాడు
మరిప్రాణం తోడెదవు
ఆనాడే ॥సెప్పు॥

ప్రభ :- అల్లావుండాలి కవిత్వంఅంటే, అందరికీ అర్థంకావాలి.

అ :- అది ఒప్పుకుంటా. కాని అందరూ పామరుల కోసం వ్రాస్తే పండితులకోసం వ్రాసేవాడెవడైనా ఒక్కడైనా వుండద్దూ ?

ప్రభ :- మాటల్లో మరపించటానికి నీవు ప్రయత్నించావు. కాని పాపం నేను గ్రహించాను నీ గేయంలోని ధ్వనిని.

అ :- ఏమిటి, ఆ ధ్వని ?

ప్రభ :- నా మీద ప్రత్యక్షంగా, పరోక్షంగా స్త్రీ జాతి అంతటిమీద, ఒక్క విసురు విసిరావులే. అమ్మదొంగా !

( తెరపడును. )



# తొమ్మిదవ దృశ్యము

(స్థలం ప్రభ ఇంటివసారా–ధనికులకు తగిన ఆసనాలు. ప్రభ అశ్వఘోషులు ఎదురుఎదురుగా కూర్చుని సంభాషిస్తూ వుంటారు.)

ప్రభ :– ఘోషూ! మీ నాన్నగారు ఇంటికి చేరుకున్న తరువాత నీతో మనవిషయం ఏమన్నా మాట్లాడారా?

అ:– ఆ ప్రసక్తే ఇప్పుడు తేవడంలేదు ప్రభా.

ప్రభ :– నువ్వు ఇక్కడనే వుంటున్నావని కోపం యేమైనా చూపిస్తున్నారా?

అ :– నేను అక్కడికి పోతూ వస్తూనే వున్నాగా. మా నాన్నగారు ఏమీ అనలేదు, కాని మా అమ్మమాత్రం నేను ఇంట్లో లేనప్పుడు ఇల్లు చాలా చిన్నబోతూ వుందని మాత్రంచాలాసార్లు అంది.

ప్రభ :– సహజమేగా. పిల్లలులేని ఇల్లు స్మశానవాటికతో సమానం అని ఎవరో అనగా విన్నాను. ఎంతనిజం ఆ మాట!.

అ :– మా అమ్మ చాలా ఉత్తమురాలు కదూ ప్రభా?

ప్రభ :– చాలా వుత్తమురాలు ఘోషూ, నిన్నొకటి అడుగు తాను, చెబుతావు? భాషలోని మాటలలోకెల్లా చాల తీపిఅయిన మాట ఏమిటో చెప్పుకో.

అ :– అదికూడా కష్టమేనా ప్రభా! అమ్మ అన్నమాటే మాటలలోకెల్లా మధురం.

ప్రభ :- అంతేనా నువ్వు చెప్పేది ? తల్లి అంటే అపార సేవా మూర్తి. పరమేశ్వర ఆరాధనయొక్క ఉత్కృష్టరూపం మాతయే. అందుకనే 'మాతృదేవోభవ' అని శ్రుతివాక్యం.

అ :- ప్రభా ! నేను మీ బుద్ధ గ్రంథాలన్నీ అధ్యయనం చేస్తూ వుంటే నువ్వు మా సంస్కృత గ్రంథాలను అధ్యయనం చేస్తున్నావు. ఆశ్చర్యంగా లేదూ ?

ప్రభ :- ఇందులో ఆశ్చర్యం ఏముంది? ఒక మతానికి చెందిన వాళ్లు ఇతర మతాలలోని సారంగూడ గ్రహించడానికి ప్రయత్నంచేసి తీరాలి. అప్పుడే పరస్పర మతసహనం మానవులకు అలవడుతుంది.

అ :- కొంతవరకూ ఒప్పుకొంటాను ప్రభా. కాని నేటి విషపూరిత విషయులోల ప్రపంచానికి కావలసింది బుద్ధదేవుని మతం.

ప్రభ :- అదీ నేనొప్పుకుంటాను. కాని భారతీయుల ప్రాచీన సంస్కృతీ అత్యున్నతమైనది.

అ :- అది నేను కాదనలేదు ప్రభా, నేననేదల్లా బుద్ధమతం నేటి మన ప్రపంచానికి సరియైనదారి చూపిస్తుందని మాత్రమే.

ప్రభ :-అందులో నాకేమీ సందేహంలేదు. చూడు, భగవత్ గీతలో 10 వ అధ్యాయం ఇవ్వాళ చదివాను. ప్రపంచంలో చరాచరము లన్నిటిలో పరమేశ్వరుడు ఉన్నాడని

ఆ అధ్యాయపుసారం. నేను సరిగా అర్థం చేసుకొన్నానా ఘోషూ ?

అ :- సరిగ్గా అర్థంచేసుకొన్నావు ప్రభా. దానిసారం, చీమ మొదలు బ్రహ్మాండమువరకూ సర్వం పరమాత్మతోనే నిండియున్నదనీ, సమస్తాన్నీ ఒకమాదిరిగానే కనిపెట్టి చూచే కృపాళువు, జ్ఞానమూర్తి, వత్సలుడు, సమర్థుడు, పావనుడు, సుందరుడైన పరమాత్మ అన్నిదిశలా సర్వత్రా వున్నాడని.

ప్రభ :- నిగ్గునితీసి ఎంతబాగాచెప్పావు ? అది సరేగాని మీ అమ్మమీద ఏమీగేయం వ్రాయ లేదా నువ్వు ?

అ :- మా అమ్మమీద గేయం వ్రాయకుండా ఎల్లాగుండ గలను ప్రభా, వ్రాసేగా ?

ప్రభ :- అది నాకు వినిపించవూ ?

అ :- అదివరకు నువ్వు విన్నదేప్రభా. అయినా మళ్ళీవిను.

(39 వ పేజీలోని శ్రీ వేదులవారి "ఆమెనవనీత హృదయ" అను గీతం పాడాలి.)

ప్రభ :- ఈ గేయం వింటూఉంటే మా అమ్మనాకు జ్ఞాపకం వస్తూంది. అబ్బా! అమ్మను కోల్పోవడం ఎంతవిషాదకరం!

అ :- నిజంప్రభా. నీబాధ నేను ఊహించుకోగలను. మానవుడు ఏవస్తువునైనా కోల్పోవచ్చు కాని అమ్మనుమాత్రం కోల్పోకూడదు. అయినా ప్రభా మాఅమ్మ మీఅమ్మ కాదూ ?

ప్ర :- నిజమే. మాఅమ్మను కోల్పోయినలోటు మీఅమ్మను దర్శించిన తరువాత భర్తీ చేసుకొన్నాను. ఇందుకు నీకు నేనెంతో ఋణపడివున్నాను. మీఅమ్మ హృదయం స్వర్గంకంటె మృదుతరం, మధురతరం. కాదూ ?

అ :- నీవన్న ఈసూక్తి అందరి అమ్మలకూ వర్తిస్తుంది.

ప్రభ :- ఉహూఁ! నాభావాన్ని సరిగ్గా వ్యక్తం చేయలేక పోయినావు. స్వర్గం, తల్లిహృదయంముందు తీసికట్టు.

( ఇంతలో ఆతురతతో సుబోధమిత్ర ప్రవేశిస్తాడు. )

మిత్ర :- (వస్తూనే) మిత్రమా!

అ :- (విస్తుపోతూ) ఇల్లావున్నావేంమిత్రా ? ఏమీ మాట్లాడవేం ? నీ వైఖరి చూస్తే నాకు భయంవేస్తూంది. ఏమిటి జరిగింది ? మిత్రా, చెప్పవేంరా మిత్రా ?

మిత్ర :- మీ ...... అమ్మ ......

అ, ప్రభ :- మా అమ్మ ......

మిత్ర :- మీ అమ్మగారికి చాలా జబ్బుగా వుంది.

అ :- (వ్యాకులంగా) అమ్మా ! అమ్మకే !

ప్రభ :- అయ్యో ! అయ్యో ! అమ్మకే !

మిత్ర :- గాభరా పడవద్దు. త్వరగారండి వెళ్లుదాం. ఇంటికి వెళ్లుదాం. సపర్యలుచేద్దాం. గాబరా పడవలసిన అవసరం లేదు.

( అందరు నిష్క్రమిస్తారు. )

---

# పదవదృశ్యము

(సువర్ణాక్షుడి ఇల్లు, ఇల్లు ముంగిట ముండనం చేసుకొన్న అశ్వఘోషుడు, అతని తండ్రి, నాగులు అందరూ రంగస్థలంమీద వుంటారు. ఇక్కడ శ్రీ నాయని సుబ్బారావుగారి మాతృగీతాలు 'ఎవ్వరా క్రూరకర్ముడు డెవ్వడు...ప్రత్యహమ్మును......' గేయం నేపథ్యంలోనుంచి పాడాలి. అశ్వఘోషుని కన్నుల వెంట కన్నీళ్లు జలజల రాల్తూవుంటవి, తండ్రి స్తబ్ధుడై వుంటాడు.)

నాగు :- విచారి స్తే ఏంప్రయోజనం, ఘోషుగారూ ? ఆమె ధన్యురాలు, ఆ తల్లి ముత్తైదువుగా వెళ్ళిపోయింది. అటు వంటి మృత్యువు అదృష్టవంతులకే దొరుకుతుంది.

అ :- అవును నిజమే. కాని, మా అమ్మ లేనిదే (ఆకస్మాత్తుగా బేలయై గద్గదంగా భోరుమని ఏడ్చి) మా అమ్మ లేనిదే అంతా శూన్యంరా నాగులూ! మా అమ్మ లేందే బ్రతకలేనురా!

నా :- ఘోషుగారూ! మీ రెంతో గొప్ప వేదాంతులు, అన్నీ తెలిసినవారూ, మీరే ఇల్లా వాపోతూ ఉంటే మీ తండ్రిగారూ, ప్రభా...

అ :- (తమాయించుకొని) నువ్వు అన్నది నిజం నాగూ. ఎంత తెలిసినా, ఎన్ని చదివినా, ఇట్టిసమయంలో గుండెనిబ్బరం చేసుకోవడం సాధ్యం కావడం లేదు.

సువు :- అబ్బాయీ! జీవితం బుద్బుదం; బ్రతుకొక మాయ; శరీరం అశాశ్వతం ; కాని ఆత్మ శాశ్వతంగదా!

నా :- (నవ్వుతాడు.) క్షమించండి నన్ను. నాకు నవ్వు వస్తొంది. ఇకముందు చనిపోయేవాళ్లు, చనిపోయిన వాళ్ళని గురించి విచారించడం వింతలలోకెల్ల వింత అని భావం కలిగి నవ్వువచ్చింది. క్షమించండి.

అ :- ఇదంతా మాయ.

సుడు :- ఇదంతా ఒక నాటకం.

అ :- అవును ఇదంతా మాయ. ఇదంతా నాటకం.

(ఇంతలో మిత్ర ఆతురతగా, పరుగెత్తుకుంటూ, రొప్పుకుంటూ రంగస్థలంమీదికి ప్రవేశిస్తాడు. వస్తూనే అశ్వఘోషుణ్ణి కౌగిలించుకొంటాడు. అతని వీపు నిమురుతాడు, అతని చేతులు తన చేతుల్లోకి తీసుకొంటాడు. అశ్వఘోషుని కళ్ళల్లోకి చూస్తూ.)

మిత్ర :- విచారిస్తే లాభంలేదు ఘోషుగారూ, అయిందేదో అయిపోయింది, ఊరటచెందాలి.

అ :- అవును. అయినా తల్లిలేని విశ్వం శూన్యంగా వుందిరా మిత్రా ?

మిత్ర :-వాపోతే, పోయినవాళ్ళు తిరిగి వస్తారు గనకనా ! అది మనోదౌర్బల్యం.

(అశ్వఘోషుడు అప్పుడే నిద్రనుంచి మేల్కొన్నవాడిలానలువైపులా వెతుక్కుంటూవుంటాడు.)

నా :- ఏమిటి వెతుక్కుంటున్నారు ఘోషుగారూ ?

అ :- నా ప్రభయేదీ ?

నా :- అవును, ప్రభ ఏది ?

ప్రభ

సుదు :- మర్చిపోయాను ప్రభయేదీ ?

మిత్ర :- ప్రభయెంత మంచిది ? మీ తల్లిగారికి రాత్రింబవళ్లు నిద్రాహారాలుమాని సేవజేసింది. పాపం ! ఎంత మంచిది ప్రభ ! !

అ :- అవును, ఆమె ఒక దేవత, దివ్య దేవత. ఆమె ఋణాన్ని జన్మ జన్మాలకు తీర్చుకోలేను. మిత్రా ! ప్రభ ఏది ?

మిత్ర :- ఆమె దివ్యలోకానికి చెందినది. పూర్వజన్మలో ఆమె మహాతపస్విని. స్వర్గంలో ఎన్నాళ్ళో తప్పక నివాసం చేసివుంటుంది. ఏదోదారితప్పి ఇల్లా యీ భూలోకంమీద అవతరించిఉండాలి.

అ :- (ఉద్రేకంగా) మిత్రా ! నీకు పుణ్యంవుంటుంది. దయచేసి కాస్తవెళ్ళి ఆమెను పిలుచుకురారా ! మిత్రా ! ఆమెలో నా తల్లిని చూచుకొంటాను. ఆమె సాన్నిధ్యం నా గుండెకు తగిలిన గాయానికి అమృతలేపనం అవుతుంది. నుంచున్నావేంరా ? పోయి పిలుచుకురావేంరా ? పిలుచుకు రావేంరా ? పోయి పిలుచుకురారామిత్రాప్రభను.

మిత్ర :- (తలగోక్కుంటూ దిగాలుపడి) వాళ్ళఇంట్లోలేదని ఆమె తండ్రి వెతుక్కుంటూ వున్నాడు.

అ :- (పిడుగుపడినట్లుగా) ఆఁ ! ఆఁ ! ఏమంటున్నావు ?

మిత్ర :- వాళ్లఇంట్లోలేదని ఆమెతండ్రి వెతుక్కుంటున్నాడు.

అ :- ఆఁ! ఆఁ! నేను సరిగ్గా వింటున్నానా ? నాకు మతి పోలేదు కదా ! సరిగ్గా చెప్పరా మిత్రా.

మిత్ర :- నేనన్నదే మీరు వింటున్నారు ఘోష్‌గారూ. ప్రభ ఇంట్లో లేదు.

అ :- అయ్యో! ఎక్కడికి వెళ్లిందిరా? ఎక్కడికి వెళ్ళిందిరా మరి ?

మిత్ర :- (కాళ్లూ చేతులూ వణుకుతూ, కళ్లు చెమ్మగిల్లుతూ జేబులో చేయిపెట్టి ఒక వుత్తరం బయటికి తీస్తాడు మెల్లగా.) ఈ........

తతిమ్మా అందరూ:- అదేమిటి ?

మిత్ర :- (వణుకుతూనే) ఒకపల్లెవానికి యీవుత్తరంఇచ్చి నాద్వారా నీకు అందజేయవలసిందని చెప్పిందట.

అ :- (ఆవుత్తరం లాక్కుంటూ గాబరాగా) ఉత్తరమా ! నాకు అందజేయమందా! పల్లెవాడా? నువ్వా,ప్రభా.........

(వుత్తరం తెరుస్తాడు, కళ్లవెంట నీళ్ళు బొటబొట రాలుతవి. చదువాలని ప్రయత్నం చేస్తాడు. కన్నీళ్ళచుక్కలు రాలుతవి. తిరిగి మిత్రకి యిచ్చివేస్తాడు. తన ఎడమచేతితో బోడిగుండుమీద గట్టిగా నొక్కుకుంటాడు నిర్ఘాంతుడై.)

అ :- ఆఁ అంతా అయిపోయింది, చదువునువ్వ మిత్రా ఏం వ్రాసిందో ?

మిత్ర :- నేనూ చదువలేను మీరే చదవండి. ( తిరిగి ఇవ్వబోతాడు అశ్వఘోషుడికి వుత్తరాన్ని)

అ :– నా కేమీ కానరాదు; కాన రావడం లేదు. నువ్వా చదువు నాగూ. ( నాగు తీసుకొని చాపురు మంటాడు. సువర్ణాక్షుడు అందరివైపు చూసి తనదృష్టి తన కొడుకుమీద రెప్ప వాల్చకుండా నిలుపుతాడు.)

మిత్ర :– (తెప్పరిల్లుకొని) నా పాత్ర వార్తల్నీ మోసుకు రావడం. సరే చదువుతాను. (మిత్ర గుండె దిట్టం చేసుకొని చదువడం ఆరంభిస్తాడు. )

''ప్రియతమా! నా జీవనమా! నా సర్వస్వమా! నా ప్రాణమా!

నీ ప్రభ ఈ ప్రపంచంనుంచి, నీవద్దనుంచి, సెలవు తీసుకొంటూఉంది. సరయూనదీ తరంగాలు పిలుస్తూ వున్నవి నన్ను. ఎన్ని రోజులనుంచో ఒకటే పిలుస్తున్నవి. శ్రీరామచంద్రుడు యీ పవిత్ర నదిలోనే నిర్యాణమప్పుడు ప్రవేశించారు. ఆ పునీతనదీమతల్లి నన్ను తన ఒడిలోకి రమ్మని పిలుస్తూవున్నది. ఆ మెుడిలో శాశ్వతనిద్ర తీసుకొంటాను. శ్రీరామునిలో ఐక్యమవుతాను. నా ప్రేమకు ప్రతిఫలంగా నువ్వొకసారి నాకొక వాగ్దానం చేశావు. మరచిపోలేదు కదా ?''

అ :– అవును. వాగ్దానం చేశాను. మరచిపోలేను. ప్రభా మరువను.

మిత్ర :– (చదువుతాడు) ''నా శాశ్వత యౌవనాన్ని, మూర్ఛపోందజాలని నా లావణ్యాన్ని, నీకు వదలిపెట్టి నేను వెళ్ళిపోతున్నాను. ముగ్ధబుట్టయైన శిరస్సు, పళ్ళూడిపోయిన

బోసిపోరు, వంగిపోయిన నడుము కల ముసిలి ప్రభను నీకు చూపించగూడదు. అల్లా చేయడం మహాపచారం అవుతుంది. ఆత్మహత్యా పాపమనీ నాకు బాగా తెలుసు. అయినా ప్రపంచ కల్యాణం కోసం, బుద్ధదేవుని ధర్మం అన్ని దేశాలలో నీ ద్వారా వ్యాపింపజేయడం కోసం, నీ కోసం, నేను ఈ పాపాన్ని మోస్తాను. రెండుసార్లు అమ్మను కోల్పోయినాను. నేనిక వుండలేను. నా భౌతిక శరీరం మాయమైనా, నా దివ్య భవ్య రమ్య పునీతప్రేమ, నా మరణములేని యౌవనం ఎల్లకాలం జీవించి వుంటుంది; నిన్ను ధర్మప్రచారంకోసం ప్రేరేపిస్తూ వుంటుంది. దాని సందేశాన్ని ఎన్నడూ మరువవద్దు సుమా, ఓ నా ప్రాణాలకు ప్రాణమా!''

అ :- ఆ సందేశాన్ని మరువలేను; మరువను ప్రభా, నీ ఆజ్ఞ నాకు శిరోధార్యం.

మిత్ర :- (చదువుతాడు) ''ప్రియుడా! ఇందుకు ఎవ్వరినీ నిందింపవద్దు. నామీద ఒట్టు, నీ ప్రేమమీద ఒట్టు, విధి బలీయం''.

అ :- (తెంపలు వేసుకొంటూ) అహా! నిందింపను ప్రభా.

మిత్ర :-(చదువుతాడు)''ప్రియుడా నేటివరకూ లోపరహితమైన నా సౌందర్యం, నాడవ్వనం, నా అనురాగం, నిన్ను లోకో త్తర కావ్య రచనకు పుద్దీపించింది. ఆప్రయోజనము కోసమే, ఆ లక్ష్య సిద్ధికే, నిన్ను విడిచి పోతున్నాను. బుద్ధచరిత్రం

పూర్తిచెయ్యి. నువ్వు తీసుకోనవలసిన తర్వాతి అడుగు నేను నీతో వేరే చెప్పాలా? నాన్నగారికి నా సాష్టాంగ దండప్రణామములు. ఆఖరుసారి నీప్రియురాలు-ప్రభ-నిన్ను కౌగలించుకొని మానసికంగా నిన్ను ముద్దుపెట్టుకుంటూంది. సెలవా! ప్రియా, ఇక సెలవా? ...... నీ ప్రభ"

(నిశ్చేష్టుడయ్యాడు. మిత్ర కళ్ళు తుడుచుకుంటున్నాడు. నాగులు చేతులతో కళ్ళు మూసుకొని కూలబడ్డాడు. సువర్ణాక్షుడు అశ్వఘోషునివైపు చూస్తూ నేఉన్నాడు. భిక్షువు ధర్మరక్షిత్ కాషాయాంబరములు తీసుకొని రంగస్థలంమీదికి వస్తాడు. అవి అశ్వఘోషుడు అందుకుంటాడు. వాటిని ముద్దుపెట్టుకుంటాడు. భిక్షువుగారికాళ్ళకు సాగిలి మోకరిల్లుతాడు. తతిమ్మా అందరూ మోకరిల్లుతారు. మళ్లీ లేస్తారు.)

ధర్మ :- బుద్ధం శరణం గచ్ఛామి,
(అందరూ అంటారు.)

ధర్మ :- సంఘం శరణం గచ్ఛామి,
(అందరూ అంటారు.)

ధర్మ :- ధర్మం శరణం గచ్ఛామి,
(అందరూ కలిసి అంటూవుంటే తెర దించబడాలి.)

A. B. H.
20-6-56
2-0

శ్రీరస్తు. శ్రీమత్ రామానుజాయనమః
శ్రీ శ్రీ శ్రీ సీతారామయతీంద్రాయనమః.

ఇతి చ

---

మనుమిత్ర ముద్రణాలయము, ఏలూరు.